# అమృతాంజనము

## అన్ని నొప్పులకు దివ్యామృతము

1893 నుంచి లక్షలాది ప్రజలు అమృతాంజనం వాడి, ఎంత అమోఘమైన శక్తికలదో తెలుసుకుంటున్నారు. అమృతాంజనంలో వాడే ఔషధాలన్నీ అతి శీఘ్రంగా బాధను పశమింప చేయుటయేగాక చాలా హాయిని కూడా కలిగిస్తాయి. హాని కలిగించే పదార్థాలేమీ లేవు కూడా. దగ్గు, జలుబు మొదలైనవి కూడా శీఘ్రంగా ఉపశమిస్తవి. అమృతాంజనం దగ్గర ఉంటే మీ రెటువంటి బాధనైనా జయించవచ్చు!






మార్చి 1958లో కాశీ అడ్మిషన్ పరీక్షకు వెళ్ళిన 38 గురు విద్యార్థినులలో దిగువపేర్కొన్న 34 గురు ఉత్తీర్ణులైరి.

## ద్వితీయ శ్రేణి

1. ఎ. రాజ్యలక్ష్మి.
2. బిమలా గుప్త.
3. చిత్రామణి.
4. గోగినేని పారాణి.
5. జి. భువనేశ్వరి.
6. జి. ఎన్. రేణుక.
7. కౌసల్యా శ్రీనివాస రాఘవన్.
8. ఎమ్. ఆర్. కృష్ణాబాయి.
9. మాలతిపట్టాభిరామన్.
10. పద్మావతి దొరై రాజ్.
11. ప్రతిమ ముత్తుస్వామి.
12. ఆర్. తిలోత్తమ.
13. శ్రీనివాస్ వసంత.
14. సుమతి రంగాచారి.
15. శాంత అనంతకృష్ణన్
16. సూర్యకుమారి దామోదరన్.
17. సత్యేశ్వరి శ్రీధరన్.
18. సరస్వతిరామకృష్ణన్.
19. టి. ఉషారాణి.
20. జయదేవి డేవిడ్.

## తృతీయ శ్రేణి

1. అహల్యా వీరరాఘవన్.
2. సి. పి. ఊర్మిళ.
3. ఐ.ఎమ్. మయూరవల్లి.
4. జె. సరస్వతీదేవి.
5. కె ఎమ్. సుభాషిణి.
6. మాలతి పరమేశ్వరన్.
7. మీన కథూరియా.
8. సీత జంజున్‌వాలా.
9. ప్రఫుల్లిక పారిఖ్.
10. పరంజిత్ కౌర్.
11. సలీమ ఇబ్రహీం.
12. శాంత కృష్ణమూర్తి.
13. టి. చెల్లం వాసుదేవన్.
14. వసంత మోహన్.

మార్చి 1958లో ఆంధ్రా మెట్రిక్యులేషన్ పరీక్షకువెళ్ళిన 4గురు విద్యార్థినులలో దిగువ పేర్కొన్నవారిద్దరు ఉత్తీర్ణులైరి.

## ద్వితీయ శ్రేణి

1. పి. బి. మణి.
2. ఎ. ఉమాదేవి

మార్చి 1958లో ఇ. ఎస్. ఎల్. సి. పరీక్షకువెళ్ళిన తొమ్మండుగురు విద్యార్థినులలో దిగువ పేర్కొన్న 5గురు ఉత్తీర్ణులైరి.

1. కె. సరోజిని.
2. ఎన్. లలితాంబ.
3. కె. శారద.
4. ఆర్. మీనాక్షి.
5. ఎమ్. ఈశ్వరి.

కుమారి గోగినేని పారాణిగారు మనసభకు 100/-లు యిచ్చి యావజ్జీవ సభ్యురాండ్రయిరి.



# ఆంధ్రమహిళ

సంపుటి 14 :: జూలై '58 :: సంచిక 7

వ్యవస్థాపకురాలు
శ్రీమతి దుర్గాబాయ్‌దేశ్‌ముఖ్

సంపాదకురాలు
శ్రీమతి కె. లక్ష్మీరఘురామ్

## విషయసూచిక




సంపుటి 14 :: జూలై '58 :: సంచిక 7

# మహిళా సంస్థలు

అఖిల భారత మహిళాసభ అధ్యక్షురాలు శ్రీమతి లక్ష్మి మీనను మొన్న ఆంధ్ర దేశములో పర్యటించి కొన్ని మహిళా సమాజాలు దర్శించి ఆ సంస్థలు చేస్తున్న కృషిని పరిశీలించారు దేశంలో మహిళాభ్యుదయానికి చేస్తున్న కార్యక్రమాల్లో ఆంధ్ర దేశము వెనుకబడలేదని, ఆంధ్ర మహిళలు ముందంజ వేస్తున్నారని అభిప్రాయపడ్డారు. అంతేకాదు ఆంధ్రమహిళలు ముఖ్యంగా గ్రామాల్లో చేస్తున్న సంఘసేవా కార్యక్రమాలని చూచి ఎంతో సంతోషించారు. మహిళలలోని భేదాలు దేశానికి ప్రమాదమని హెచ్చరించారు. వారు ఏలూరు మహిళలకు చెప్పిన కథ ఇక్కడ పునరావృత్తము చేయుచున్నాము. మహిళాభ్యుదయ సేవాభిలాషులకయ్యేది ఉపయోగమని తలంచుచున్నాము

ముగ్గురు కూలీలు రాళ్ళు పగలగొట్టుచున్నారు. మొదట వానిని ఏమిచేయుచన్నావని యడుగగా "రాళ్ళు కొట్టుచున్నా"నన్నాడు. రెండవవాడు ఆ ప్రశ్నకు "పొట్టకూటికి రాళ్ళు పగలగొట్టుచున్నాడు. కాని మూడవవాడు అదే ప్రశ్నకు "దేవాలయము కట్టుటకు రాళ్ళు పగలగొట్టుచున్నానని" ఎంతో గర్వంగా ఆనందముతో చెప్పాడు. ముగ్గురు వ్యక్తులు చేయుచున్న పని ఒకటే. అయినా వారు ముగ్గురు ఆ పనిని విభిన్న దృక్పథంలో చూచారు. అట్లాగే పెక్కుమంది స్త్రీలు సంఘసేవ చేస్తున్నా, వారు ఆ "సేవ"ను ఏ దృక్పథంలో చేస్తున్నారా అనేది చాలా ముఖ్యము. తాము చేస్తున్న పని గొప్పదని నమ్మి దానిలో ఆనందము గర్వము కలిగి చేసే సంఘసేవిక కృషి తప్పక ఫలించగలదు. కాబట్టి సంఘసేవ చేస్తున్న, చేయనున్న సోదరీమణులు వారికది అపూర్వ అవకాశముగాదలచి తాము చేస్తున్న కార్యములోని దివ్యత్వము గ్రహించి మానవసేవ మాధవసేవే యని తలంచి గుడి కట్టుటకు సహాయపడుతున్న కూలివానివలె ఆనందముతో తమ కృషి సాగిస్తే ఆ కృషి నిరర్థకము కాజాలదు, మొదటి రెండవ కూలీలవలె ఏదో సంఘసేవ చేస్తున్నామని చేసే సేవ, పొట్టకూటికి చేస్తున్న సేవ, రెండూ సార్థకము కాగలవు. కావున సంఘసేవా కార్య రంగములో నున్న సోదరీమణులు తాము చేయుచున్న సత్కార్యములోని విలువ గ్రహిస్తూ తదనుగుణంగా సేవా కార్యక్రమము నిర్వహించదగును.

—



జెమినీవారి

## 'విజయ వీరుడు'లో

ఒక దృశ్యం.

ప్రముఖ నాట్యతారలు

వైజయంతిమాల, పద్మిని

నటించిన తెలుగు చిత్రం ఆంధ్రలో విడుదల కానున్నది.

నర్సింగ్ హోమ్

హైదరాబాదులోని రీజియనల్ [illegible] ఇన్స్టిట్యూట్‌కు
మా శుభాకాంక్షలు



మహిళావిద్యాలయం, హాస్టల్
ఆంధ్రమహిళా ప్రెస్
ఇండస్ట్రియల్ ఇన్స్టిట్యూట్
నర్సింగ్ హోమ్
నాగేశ్వర శిశువిహార్
వనితా బాలవిహార్
ఆంధ్ర మహిళాసభ సంస్థలు

## లఘు పరిచితలు

# అనసూయా ప్రియంవదలు

శ్రీమతి జి. సుందరీ శంకరం

అనసూయా ప్రియంవదలు అను యీ యిరువురు కణ్వాశ్రమమందలి మునికన్యలు. శకుంతలకు ప్రియ సఖులు. శకుంతల కథ మహా భారతములోనున్నది. ఆ కథ అంత రసవత్తరముగ లేదు. మహా భారతము యొక్క అభిప్రాయము పూర్వ గాథను తెలుపుటయే యైనందున కథ క్లుప్తముగ ముఖ్యాంశములతో మాత్రమే నడచినది. కాని మహా కవియైన కాళిదాసు జగన్మోహనమగు నాటకమును సృష్టించినాడు. పురాణ ప్రసిద్ధమైన శకుంతలా దుష్యంతుల కథను పండిత పామరజన రంజకముగ అనౌచిత్యములను పరిహరించి రసోత్పత్తి నొనర్చు నూతన విషయములను జేర్చి మహాకవి తన యసమాన కళా నైపుణ్యమును ప్రదర్శించినాడు.

భారత కథలో దుష్యంతుడు ఒకనాడు వేట నిమిత్తమై యడవికి జని కణ్వాశ్రమము జొచ్చుట, అచట నప్పుడు శకుంతల యొంటరిగ నుండుట, యాతని కామె యాతిథ్యమొసంగుట. దుష్యంతుడామె నిరుపమాన సౌందర్యమును మెచ్చుకొని మోహితుడై యామె జన్మ వృత్తాంతమును ఆమెనే యడిగి తెలుసుకొనుట, గాంధర్వమున వివాహమాడుట మొదలగు అనౌచిత్య విషయములు మూల గాథ యందు కనబడుచున్నవి. కాని కాళిదాసు తన నాటకములో శకుంతలకిద్దరు చెలికత్తెలను కల్పించెను. శకుంతలయు, నామె చెలికత్తెలయు నిష్కాపట్య వృత్తి, నిర్వ్యాజానురాగము వారి యుద్యానవన దోహదక్రియలు అతి రమణీయముగ చిత్రించెను. నాటక ప్రారంభమందే ప్రాచీన ఋష్యాశ్రమము లందు గల పవిత్ర నిరాడంబర జీవనము ప్రేక్షకుల కనులయెదుట ప్రత్యక్షమగునట్లు మహాకవి చిత్రించినాడు.

రాజు శకుంతలకుగాని ఆమె చెలికత్తెలకుగాని యెదుట బడకుండ ప్రచ్ఛన్నుడై యుండి, వారు మొక్కలకు నీళ్ళు పోయుచు నాడుకొను సరసల్లాపములన్నియు వినుచుండును తన మొగము మీదికి మూసరుచున్న భ్రమరమునకు భయపడి శకుంతల తన్ను రక్షింపుడని సఖులను కోరగా వారు పరిహాసమునకు "కే ఆవాం పరిత్రాతుం దుష్యంత మాక్రందయ" అని పల్కగా ఆ మిషతో దుష్యంతుడు శకుంతలనెదుట పడుట అతి మనోహరముగ నున్నది. అంతట రాజునకు మునికన్యలకును జరిగిన సంభాషణమతిరమణీయమైయుండును. అంత శకుంతల యొక్క జన్మ వృత్తాంతమును చెలికత్తెలైన అనసూయా ప్రియంవదలే రాజునకెరిగింతురు.

శకుంతల యెడల వీరిరువురును తోడబుట్టువులవలె ప్రీతిని జూపుదురు. వీరిరువురకును శకుంతలపై అత్యంతానురాగము కలదు. ఆ యనురాగము నిష్కపటమైనది, నిర్వ్యాజమైనదికూడ- అనసూయా ప్రియంవదలిరువురు తమ తెలివి చేతను వినయ సంపత్తితోను, చమత్కార భాషణముల వల్లను శకుంతలా దుష్యంతుల సంయోగమునకు దోహద మొనర్చుటయే గాక, దూర్వాసుని శాప విమోచనమునకు గూడ కారణ భూతులై కథా గమనమునకు మిక్కిలి తోడ్పడుదురు.

ప్రియంవద చమత్కారముగ మాట్లాడుట యందును, పరిహాసము చేయుటయందును నేర్పరి. జాణతనము గలది. అనసూయ కొంచెము వయసున పెద్దది యగుటచే కాబోలు బాధ్యతాయుతమైన ప్రవర్తన మీమెయందు కనబడుచుండును. శకుంతల పొగడ చెట్టువద్ద నిలుచున్నపుడు ప్రియంవద యామెతో "హలా శకుంతలే అత్రైవ తావన్ముహూర్తం తిష్ట, యావత్వ యోపగతయా లతా సనాథ ఇవాయం కేసరవృక్షకః ప్రతిభాతి" సఖి! శకుంతలా అచ్చటనే కొంత నిలువుము. నీవు చేరువ నున్నపుడు ఈ కేసర వృక్షము తీగతో కూడుకొన్నట్లు శోభించుచున్నది. అనుటచే శాకుంతల సౌందర్య విషయమున లతాంగి యను సార్థక నామధేయ యనియు, వృక్ష రాజము నాశ్రయించుటచే రాజాశ్రయము పొంద దగినదనియు సూచించుచున్నది. ఎదుటివారి మనసునందు గల యభిప్రాయమును గ్రహించుటయందు ప్రియంవద కడు నేర్పరి. శకుంతలా జన్మ వృత్తాంతమును విని రాజు తన మనసులో శకుంతల వివాహమాడునా లేక యెల్ల

కాలము బ్రహ్మచారిణిగానే యుండిపోవునా యను సంశయముచే బాధపడుచుండ ప్రియంవద యిది గ్రహించినదై "పునరపి వక్తు కామ ఇవార్యః" అనును. ఆమె తెలివికి రాజు మెచ్చుకొని "సమ్యగు పలక్షితం భవత్యా" అని ప్రశంసించును. అల్లే శకుంతల దుష్యంతుని విషయమై విరహవేదన ననుభవించు చుండగా శకుంతలా దుష్యంతుల సమావేశమునకు అనసూయ ఆలోచించుచుండ- "శీఘ్ర మితి సుకరం నిభృతమితి చింతనీయం." అని ప్రియంవద అనసూయతో చెప్పును. తరువాత కథ అందరికీ తెలిసినదే శకుంతలను దుష్యంతుడు గాంధర్వ విధిచే వివాహ మాడుట, కణ్వుడు యోగ్యుడగువానినే యామె వరించెనని సమ్మతించుట పిమ్మట గర్భవతి యగు శకుంతలను కణ్వుడు దుష్యంతుని కడకు గౌతమీ మొదలగు తాపసులను తోడిచ్చి పంపుట, దూర్వాస శాప వశమున శకుంతలను దుష్యంతుడు విస్మరించుట మొదలగు రసవత్తర ఘట్టములన్నియు నడచును.

ఇందు అనసూయా ప్రియంవదలు శకుంతలకు దూర్వాసుని శాప వృత్తాంతమును తెలుపని కారణమున దుష్యంతునిచే శకుంతల తిరస్కరింపబడి మారీచ్యాశ్రమమందు మఱల తలదాచుకొనవలసి వచ్చుటయు, అచ్చటనే భరతుని కనుటయు, చివరకు అచ్చటనే దుష్యంతుడు దేవేంద్ర సహాయార్థమై దేవలోకమునకు వెడలి తిరిగి వచ్చు సమయమున మారీచ్యాశ్రమమందున్న తన పుత్రుని, తన భార్యయగు శకుంతలను పరిగ్రహించి మరీచి మహామునివలన దూర్వాసుని శాప వృత్తాంతమును తనకు శకుంతల యందు కలిగిన విస్మృతిని తెలిసికొనిన వాడై భార్యాపుత్రులతో స్వదేశాభి ముఖుడై వెడలుట, మొదలు గాగల కథ యావత్తు పెరుగుట తటస్థించినది. లఘు పరిచితలైన అనసూయా ప్రియంవదలు మహాకవి కాళిదాసు రచించిన శాకుంతలా నాటక కథా విస్తృతమునకు యెంతయు తోడ్పడిరి.

(ఈసారి రామాయణంలో లఘుపరిచితయైన ఊర్మిళాదేవిని గురించి తెలుసుకుంటారు)

— సంపాదకురాలు



"తంఘాన తాన"

[illegible] స్కూలు ఆఫ్ ఆర్ట్సు అండ్ క్రాఫ్ట్సు. [illegible]

# శ్రీ మహాభారత సౌరభము

శ్రీమతి పొత్తూరి కామేశ్వరమ్మ

మంత్రహ్రదా, త్కథాకుల్యా, విద్యాకేదారమాగతాః
మోక్షశ్రియః. ప్రసూర్మర్త్యైః, పీయతే, కర్మమార్గగైః.

మంత్రమనగా, వేదము, వేదము హ్రదము ఆ హ్రదము నుండి, కథాకుల్య ప్రవహించినది. ఆ కాలువ నీరు. విద్యాకేదారమను, క్షేత్రమును తడిపినది. అక్కడ పండిన పంట. పునరావృత్తి రహితమైన, మోక్షశ్రీ, ఆకథాకుల్యలోని, జలముతో, కర్మపథానుయాయులు. నడుమ నడుమ, తమ దాహమును తీర్చుకొనుచున్నారు. ఆ కథ వారి దాహమునకు ఏర్పడి పారుచున్నది కాదు. వారితృష్ణను నివారించుటకు ఆ కాలువ అను షింగికము. మరి అది చేయవలసిన పని. విద్యాకేదారమును తడుపుట. ముక్తిసస్యమును, పండించుట... భారత దేశమున, అధికార తారతమ్యముతో. మహా భారత పారాయణము భూత భవిషత్, వర్తమానకాలముల యందు. అనుస్యూతముగా జరుగుచున్నది. ఈ గ్రంధమును, ప్రవృత్తి సాధనముగా నొకరు నివృత్తి బోధకముగా మరి యొకరు, భావించి. పారాయణము చేయుచున్నారు. మరియూ కొందరు పౌరాణికులు. పురాణ రూపేణ ప్రచురణలు చేయుచున్నారు. ఇది 'ఇరువైపుల పదను గల చురకత్తి'

తత్వతః. కర్మ భూమియైన ఈ భరతఖండము, వేద గోక్షీరము నుండి. తీసిన, నవనీత ఖండము, ఈ వెన్న ముద్దతో (సంగోరు మహా తల్లి,) యశోదాదేవి. సగుణ కృష్ణునకు తినిపించినది. ఆ ముద్ద బలముతో. ఒడలు చేసి 'గడతేరి' శ్రీకృష్ణుడు, పార్థునకు, సారథ్యము నడిపినాడు. అతనికి. తన విశ్వరూపమును సిద్ధిసాధనముగా. చూపినాడు. చూడగా. ఈ మహా భారత తత్వము. ప్రవృత్తిని ఊనుకొని, నివృత్తిని ఆనుకొని యున్నది. నేడదినివురు గప్పిననిప్పు, ఈ మహాభారతాంతర్గత, జ్యోతిర్మండల మధ్య వర్తినియై. (వెలుగని) భగవద్గీత, యొక్కటి యున్నది. అది, గోచరమైనవారికి యావద్భారతమునూ మిధ్యగా, తోచును, అట్లు కానివారికి, అది తెలిసికొనుటకు, భారతము కంటె మించిన, గతి యింకొకటిలేదు. అంతకు మించిన 'జగత్' భాష్యము మరియొకటిలేదు. అలేఖ్యమైన అమ్నాయ తత్వమును నోట బెట్టరాని చేదు మందు. ఆ మందునకు, తోడు వ్యాఖ్యాతలు మకరందమును, అను పానము చేసి' భవ రోగులకు 'ఒంటబట్టించుటకు' ప్రయత్నించిన ఋషిభిక్కు, వ్యాసుల, వారు వారి అడుగు జాడల నుండి. ఆచార్యశంకర పాదులు జగదభ్యుదయనిశ్శ్రేయసకాంక్షతో, గణాధిపతి గంటమునకు పసిడి గంటలు, అలంకరించిరి, భగవద్గీత, సనత్సుజాతీయము. విష్ణుసహస్రనామము, యివి అన్నియు, ఆచార్య భాష్యముల కందిన. భారతామృత బిందులు.

ఇతరములెన్ని యున్ననూ, రత యావద్భారత జాతిని, నడిపించు, మహోత్తమ గ్రంథములు, మూడే, మూడు, అని అందరకు, తెలియుననుకొనుచున్న భారత భాగవత రామాయణములు, రామాయణము త్రేతాయుగములోనిది కాగామిగిలినది, ద్వాపరకలి యుగ సంధికాలములోనివి, యుగముల హద్దుపద్దులేల.? యుగ యుగములకూ ఈ మూడే, చాలినవి.

'మనము రామాయణ గ్రంధ మందు' మానవ, దానవ ధర్మా ధర్మములకు, జరిగిన పోరాటమును చూచితిమి. సగుణమునకు వినాశముతప్పదు, విభీషణుడు దానవ జాతి అయిన నేమి,? పరమార్ధమున, అతనిది మానవ ధర్మము గల, హృదయము, అందువలననే, రావణ వధానంతర మందు, లంకా రాజ్యమునకు,అతనికి అభిషేకము, జరిగెను. ఇక సుగ్రీవుడు జాతికి వానరుడు అగుగాక, అతనిలో కరడు గట్టినది నరధర్మము ఈ ధర్మమే, వాలి వధానంతరము, అతనిని కిష్కింధకు, ఏలికను చేసినది. వానరులకు వానరుడే, పాలకుడు, దానవులకు దానవుడే

ఏలిక, ఈ ధర్మము రాముని ఏలు బడిలో, ముఖ్య ధర్మమై నిలచినది అటు ప్రభువైన విభీషణునకూ, ఇటు ప్రభువైన సుగ్రీవునకూ, మనుస్మృతి ప్రమాణముగాని, దను జవాన రస్మృతులు గావు, రాముడు తానెవరిలో, మానవ ధర్మ మును. పరికించెనో, వాని తలపై కిరీటపు బరువు నుంచెను, సుగ్రీవ విభీషణులు. రాముని ధర్మ నిష్టకు, తగిన వారు, రామాయణమున మానవేవతర పాలకులలో గూడ, మానవ ధర్మమే ఉండవలెనని, రాముడు నిలబెట్టి నాడు పరదారా పహరణము ఒక మానవులకే కాదు—దానవ వానరులకూ కాని కార్యమే, అని రామాయణము చాటినది.

రామాయణములోని. రావణ వాలులకు, కొంత వరకు సరి తూగగల, భారతమునందలి. దుర్యోధనునకు ఈ దానవమానవ లక్షణములు, పట్టినవి, అప్పుడు ధర్మాభి రాముడైన, శ్రీకృష్ణుని, రాజకీయ చక్రము ఒక్క సారి తిరిగినదనిన, లీల అతనిదికాగా, యశోమాల అర్జునుని మెడలో, వచ్చిపడినది.

ఈ మహా భారతము, మనకు ముందు యుగమున జరిగినది మానవ రాక్షసుల పోరాటము గాక. మానవ కుటుంబముతో జరిగిన పోరాట మగుటచే" మనకు మరియూ సన్నిహితమూ, అను భూతముగ. ఉన్నదని పించుగాధ, "ఆహా ! ఒకనాటి మన భారతీయ కుటుంబ మిట్టిదా," అనుకొనుచూ మనము చదువుకొని నెమరు వేయుచున్న పవిత్ర కథ.

వేదవ్యాస మహర్షి పురాణ ఉపపురాణములు, ముప్పది యారు రచించెను. గాక! ఈ మహా భారతమొక్కటియే, నేటికి, ఈ భారతావనిలో, గాలి. తేజస్సులవలె, సంచారము చేయుచున్నది. ఉపనిషత్తులలోని అధ్యాత్మ విద్య నుండి సాహిత్యములోని ఖండకావ్యము వరకు, అర్థము కాని. వ్యాసఘట్టముల నుండి ఆ బాలము ఉపయోగపడు పిట్ట కథల వరకు. ఈ మహా భారతము, తన విశ్వరూపమును, ప్రదర్శించుచున్నది. వైజ్ఞానికమైన, సంపదకూ, సాంఘిక ములైన మర్యాదలకూ, రాజకీయమైన యెత్తుగడలకూ, సారస్వత సంబంధమైన పోకడలకూ, సర్వమునకూ, మహా భారతము వేయి పడగల శేషభోగి, భరతఖండము యొక్క సంస్కృతి సాంప్రదాయములు నీతి నియ మములూ, ధర్మ కర్మములూ, ఈ భారత మందు నిండిని బిడీకృతములై ఉన్నవి. దీనిని యెవ్వరెట్లు భావించిననూ, వారి కారూపముతో, ప్రత్యక్షమగును. ఇక్కడ ఆంధ్ర ప్రథమకవి నన్నయగారి, పద్యము మనకు, సరిపోవును

॥సీ॥ ధర్మ తత్వజ్ఞులు ధర్మశాస్త్రంబని, యధ్యాత్మవిదులు వేదాంతమనియు నీతి విచక్షణుల్ నీతి శాస్త్రంబని, కవి వృషభులు మహా కావ్యమనియు, లాక్షణికులు. సర్వ లక్ష్య సంగ్రహమనియైతి హాసికులు, ఇతి హాసమనియు, పరమ పౌరాణికుల్, బహు పురాణ సముచ్చయంబని, మహిగొనియాడు చుండగ॥ వివిధ వేదతత్వవేది, వేదవ్యాసు, డాదిముని పరాశరాత్మజుడు, విష్ణు సన్ని భుండు. విశ్వజనీనమై. పరగుచుండచేసె భారతంబు.

అందరికంటెను ఆంధ్రుల జీవితానుభవములను, వారి మనః ప్రవృత్తులకు వారి మాట తీరులకు. భారత గాధ దగ్గిర చుట్టము. అని యెవ్వడో ఒక్కడే అన్న మాట కాదు, ఈనాడు తెలిసికొన్నదియూ కాదు. తొమ్మిది వందల యేండ్లనాడే యీ యెరుక పరిమళించినది. అది మొదలు కవిత్రయము. పోషణముతో, ఈ మహా భారతము ఫలిత పారుజాతమై. తెలుగువారి హృద యోద్యానమున. తేనె విందులు, పంచుచునే యున్నది. తెలుగు సాహిత్యమునకు, కవిత్రయ. భారతములో, ఒర వడి పడుట ఈ జాతి చేసికొన్న యెన్ని పుట్టువుల పుణ్య ఫలమో, కవిత్రయము వారి ఆంధ్రీకరణము, అందరి ఆంధ్రీకరణము వంటిదికాదు అది ఆంధ్రీకరణమేకాదు, వారు మూవురునూ, మహా కావ్యదృష్టితో. రసపుష్టి చేసి కొనుచూ, పరమస్వతంత్రముగా, భారతమును నడి పించిరి. మూల గ్రంధములోని అనేక స్థలములలో, తమ నాటి ఔచిత్యమునకు, చేర్పు మార్పులతో, నూతనా వతారము నెత్తించి వారు రచించిరి. వారి రచనకు. చేయెత్తి ఒక నమస్కారము, ఆంధ్ర మహా కవుల హృదయేమే, యింత మధుర గంభీరమై ఉండగా, భారత మహర్షి వేద వ్యాసుని ఆత్మ రహస్యమూ కవితా తత్వమూ. యెంతటివో అని, మన తెలుగు ప్రజలు, ఉవ్విళ్ళూరుట సహజముకాకపోదు. సంస్కృత మహా గాధ సంస్కృతము రాని ప్రతి పురుషుడునూ, ప్రతి మహిళయూ చదువుకొని ఆనందించి తమ జీవితములకు మెరుగులు దిద్దుకోవలయును, వ్యాస హృదయము ఉన్నది ఉన్నట్లు, తెలుగు వారికి చిక్కవలయును, తెలుగు జాతి ఆ బాలగోపాలమూ. అభ్యుదయ పరం పరల, ననుభవింప వలయును.

సర్వేజనాస్సుఖి నోభవంతుః.

---

# అనితల్లీదేవి

## శ్రీమతి వారణాసి యశోదాదేవి

ఆంధ్ర దేశము నంతను యవిచ్ఛన్నముగ దాదాపు 1½ శతాబ్దములు పాలించారు రెడ్డి రాజులు, అది మన దేశ చరిత్రమున మధ్య యుగము. రెడ్డి రాజులు కాక తీయులకు రాజకీయ వారసులై 14, 15 శతాబ్దములలో దేదీప్యమానముగ రెడ్డి రాజ్యమును సాగించిరి, వీరి ముఖ్యమైన రాజధానులు కొండవీడు రాజమహేంద్రవరములు, రెడ్డి రాజ్యమునకు సమకాలిక రాజ్యములు- తూర్పున కళింగ గాంగ రాజ్యము, వుత్తరమున బహమని, విద్యా నగర రాజ్యములు, పడమటను. రాచకొండ. దేవరకొండలు రాజధానులుగ వెలమ రాజ్యము- యుండెను.

రెడ్డి పరిపాలకులలో కడగొట్టు రాణి అని తల్లీదేవి. ఈమె తండ్రి కాటయవేమారెడ్డి రాజమహేంద్రవర రెడ్డి రాజ్య నిర్మాత, ఇరువదేండ్లు రాజమహేంద్ర వరము రాజధానిగ పూర్వ—తూర్పు రాజ్యమును జయప్రదముగ పాలించి కాటయవేమారెడ్డి క్రీ॥శ॥ 14 15 ప్రాంతమున మృతి నొందెను; పుత్రుడు కుమారగిరి యంతకు పూర్వమే చనిపోవుట వలన, అని తల్లికి రాజ్యము సంక్రమించెను, ఈమె తల్లి దొడ్డాంబిక, కాటయవేముని సైన్యాధిపతియైన అల్లాడరెడ్డి ద్వితీయ పుత్రుడు వీరభద్రారెడ్డి, అని తల్లి భర్త, కాక తీయ సామ్రాజ్యమును రుద్రమదేవివలె, రెడ్డి సామ్రాజ్యమును పరిపాలించిన రమణీమణి యీమె యొక్కతయే, శ్రీ నాధ కవి సార్వభౌముని రచనలు, అని తల్లి కల్వచేరు తామ్ర శాసనము, ఆమె రాజ్యరమను, పరిపాలనా దక్షతను ధృడపర్చుచున్నవి.

అని తల్లి రాజ్యకాలములో మొదటి దశాబ్దములో— క్రీ॥శ॥ 1416—1425— మామగారు అల్లాడరెడ్డి కొడుకు కోడలు తరపున రాజ్య భారము వహించెను, అల్లాడ రెడ్డి, మరణానంతరము, అని తల్లి భర్త వీరభద్రారెడ్డి, బావగారు అల్లాడ వేమారెడ్డియు, రాచకార్యముల జక్కబెట్టుచుండిరి. రాజ్యము తూర్పున చిల్క సముద్రము వరకు విస్తరించెను, ప్రజలు సర్వసౌఖ్యముల ననుభవించుచుండిరి.

క్రీ॥శ॥ 1417 ప్రాంతమున అన్నవర ప్రాంతముల విస్తృతి నంది రెడ్డి రాజ్యమునకు ప్రక్కలోని బల్లెము వలెనున్న తెలుగు చోడ రాజ్యము యంత మొందింప బడెను. అన్నదేవ చోడుడు, అతని కుమారుడు వీరభద్రుడు హతులైరి. జయముల సిదప అల్లాడరెడ్డి కళింగముపై దండెత్తి, సామంత రాజుల గెల్చి, కప్పముల గొని, గజపతి దళవిభాళ బిరుదుగాంచెను, ఝూడె, సప్త మాడెములు, బారుహ, దొంతి, యొడ్డాది లాజుల గెల్చెను, బహమనీ సుల్తాను ఫిరోజ్‌షాపై విజయముల గాంచెను, కాని ఫిరోజ్‌షా పిమ్మట బహమనీ రాజ్యమేలిన అహమ్మదుషా అల్లాడరెడ్డికి మిత్రుడు, రెడ్లమంత్రి బెండపూడి అన్నయామాత్యుడు రెడ్డి, బహమనీ రాజ్యముల మధ్య సామరస్యము కుదిర్చెను, హోషాంగ్‌గోరీ బిరుదు వహించిన మాల్వా సుల్తాను అలప్‌ఖాను కళింగ ముపై దండెత్తిరాగా, అల్లాడరెడ్డి, వేమ. వీరభద్రారెడ్లు, యతని నోడించి, తరిమి, యతని హయములను కొల్లగొట్టిరి. విద్యానగర చక్రవర్తి దేవరాయలు అల్లాడ రెడ్డికి మిత్రుడు.

మామగారి మరణానంతరము, అని తల్లి భర్తతో రాజ్య భారము పంచుకొనెను, వీరభద్రుడు పట్టాభిషిక్తుడై అని తల్లీదేవి భర్తగ పేర్కొనబడి యున్నాడు. రెడ్డి సైన్యములు వంగ దేశమున పండువా రాజ్యము వరకు జైత్రయాత్ర వెళ్లెను, ఆంధ్రదేశాధీశ్వర, జగదొబ్బగండ, సంగ్రామ ధనంజయ బిరుదాంకితుడైన వీరభద్రారెడ్డి కళింగ పట్నము, పాలకొండ, లోతుగడ్డ, అంపడా, బొబ్బిలి, కసింకోట, జీడికోట, వీరఘట్టం, కటకము, పురుషోత్తము, పర్లాకిమిడి, చీకటి, బారువ, రంభా, శృంగవరపుకోటలను జయించెను ఇవన్నియు క్రీ॥శ॥ 1426 ప్రాంతమున వీరభద్రారెడ్డి అన్నగారితో కళింగ దండయాత్రలో గెల్చి సముద్రతీరమున సింహాచలము, పురుషోత్త- పూరీజగన్నాధు—లలో విజయస్తంభముల నిల్పెను. గజపతి భానుదేవుడు 4 రాజ్యములోని సామంత రాజుల గెల్చుట వలన, వీరభద్రుడు గజపతి దళవిభాళ

బిరుదు ధరించెను. వెలమ రాజు లింగమనేడు రెడ్డి రాజ్యముపై దండెత్తిరాగా, విద్యా నగరసైన్య సహాయంతో రెడ్లు వాని నోడించిరి. వీరభద్రారెడ్డి. దేవరాయలు II బంధువులు, మిత్రులు కూడ నైయుండిరి. శ్రీ నాధుడు యీ కాలమున విజయనగరమున కేగి సన్మానము గాంచెను. క్రీ॥శ॥ 1455 నాటికి రెడ్డి రాజ్యము గజపతి చక్రవర్తుల వశమయ్యెను.

రాజమహేంద్రవరములో రెడ్లరాజభవనము త్రైలోక్య విజయ సౌధము గౌతమీ తీరమున నుండెను. దీనపై అంతస్థు చంద్రశాలనుండి గోదావరీ యలల సౌందర్యము విలాసము గాన వచ్చుచుండెను. ఈ చంద్రశాలలో వీరభద్రారెడ్డి కొలువు దీర్చుచుండెను. రెడ్డి రాజుల కుల దైవము మార్కండేయస్వామి. అని తల్లి దాన శాసనములు శ్రీ మార్కండేశ్వర- యను రాజముద్రతో పూర్తియగుచుండెను. వీరభద్రుడు శివపూజా దురంధరుడు: రెడ్డి బిరుదావళిలో బసవ శంకర బిరుదము గలదు. మార్కండేయ ఆలయములో స్వామి సమక్షమున వీరభద్రారెడ్డి యనేక దానముల జేసెను. ద్రాక్షారామ భీమేశ్వరస్వామిరెడ్డి రాజ్యమునకు రక్షక దైవము. రెడ్డి రాజ్యములో ముఖ్యమైన యాత్రాస్థలములందును, రాజధానియందును యేటేట మహావైభవముగ వసంతోత్సవములు జరుగుచుండెను. రెడ్డిరాజ్య ప్రశస్తిలో కర్పూర వసంతరాయ బిరుదము గలదు. వుత్సవములో కర్పూరమును దశదిశల వెదజల్లువారట.

అని తల్లి కొలువులో కళలు యభివృద్ధిగాంచెను. రాకుమారుడు అనపోతారెడ్డి కొమ్మిచిక్కాల గ్రామమును శకున బ్రహ్మయని పేర్గాంచిన ఖగోళ శాస్త్రజ్ఞుడు పిన్నయకు దానమిచ్చెను. రెడ్డి యాస్థాన కవులు సూరన, ధూర్జటి గోపాలకవి, రామయ యల్లయామాత్యులు, వీరభద్రారెడ్డి పండితుడు, వక్త. అభినవ భోజ బిరుదాంకితుడు. కొలువులో శాస్త్ర సాహిత్య మీమాంసలు జరుగుచుండెను. శ్రీనాధుడు విద్యాధికారి. సరస్వతీభట్టు కవి బ్రహ్మ, వైయాకరణవేత్త. వేదాంత తర్క శాస్త్రములలో మేటి నిశ్శంకుని కొమ్మనామాత్యుడు వీరభద్రారెడ్డి తమ్ముడు దొడ్డారెడ్డికి యంకితముగ శివలీలా విలాసమును రచించెను. ఇందు రెండు యాశ్వాసములు మాత్రమే లభ్యమైనవి. ఇందలి యవతారికలో రాజమహేంద్రవర వైభవము వర్ణితమైనది. కొమ్మనామాత్యుని మరొక రచన వీరమహేశ్వరము, ఇందలి పద్యములు వుదాహరణ గ్రంధము. ప్రబంధ రత్నావళిలో నుదహరింపబడినవి. కవి సింగనభట్టు భారతనీతి రత్నాకర వ్యాఖ్యల రచించెను ఇతనిని అల్లయవేమారెడ్డి యాదరించెను.

మంత్రులు బెండపూడి లింగన, అన్నయామాత్యులు, తాము వైదుష్యముగలవారై పండితుల నాదరించిరి. శ్రీనాధుడు భీమ ఖండమును అన్న మంత్రికి కృతి యిచ్చెను.

శ్రీనాధుడు తెలుగు సారస్వత ప్రపంచములో కవిత్రయము తర్వాత మేటి, రెడ్డి రాజ్య విద్యాధికారిగ నితడు రాజశాసనముల రచించెను; కావ్యములనల్లెను; చాటువులచెప్పెను: అనేక భాషలనేర్చెను. వివిధ విషయముల సాంగోపాంగముగ దెలసియుండెను. విద్యానగరము, రాచకొండ, రాజాస్థానములకేగి గౌరవింపబడెను. రెడ్డిరాజులతో తీర్థయాత్రలకేగుచు, రాజధానిలో వుత్సవములలో పాల్గొనుచు శ్రీనాధుడు శృంగార శేఖరుడై యిహ భోగములనన్నిటిని సాకల్యముగ ననుభవించెను, శ్రీనాధుని ముఖ్యరచనలు- మరుత్తరాట్చరిత్ర, శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్ర శృంగార నైషధము. భీమేశ్వర పురాణము. కాశీ ఖండము, పల్నాటి వీరచరిత్ర.క్రీడాభిరామము (ఆదియే వీధి నాటకము) యితని పేరునగల గ్రంధములు— నంద నందనచరిత్ర, వల్లభాభ్యుదయము, కామశాస్త్రము, ధనంజయ విజయము, భృంగసందేశము, చాటువులు ఇవి అన్నియు లభ్యము కాలేదు.

ప్రౌఢ దేవరాయల యాస్థాన కవియైన కవిసార్వభౌముడు డిండిమభట్టు IIను వుద్దండ వాదమున నోడించి యతని కంచు ఢక్కను పగులగొట్టించి, ముత్యాలశాలలో స్వర్ణాభిషేకముచే గౌరవింపబడెను. శ్రీనాధుడు అప్పటినుంచీ శ్రీనాధుని కవిసార్వభౌమత్వము సార్థకమయ్యెను. రాజకొండ సర్వజ్ఞసింగ చక్రవర్తిని శ్రీనాధుడు మెప్పించెను.

సంగీతమున వీరభద్రారెడ్డి విద్వాంసుడు. వీణ, వేణు వాద్యముల నిపుణుడు. శ్రీనాధుడు సంగీత విద్వాంసుడైయుండెను. సంగీతము, నృత్యము, యితర లలితకళలు అనితల్లి రాజ్యములో యభివృద్ధిగాంచెను.

---

ఆధారములు.

1. రెడ్ల చరిత్ర - వా ర ణా శి. యశోదాదేవి. 2. శృంగార శ్రీనాధము— వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. 3. ఆంధ్రుల చరిత్ర IIIభాగము— చిలుకూరి. వీరభద్రరావుగారు. 4. సమకాలిక కవుల రచనలు, శాసనములు.★






ఇండియాలోని శాస్త్రీయ సాంప్రదాయక నృత్యాలు

# ఇండియాలోని శాస్త్రీయ సాంప్రదాయక నృత్యాలు

## శాస్త్రీయ నృత్యాలు

భారత దేశపు సాంస్కృతిక వారసత్వసంపదగా మనకునాలుగు రకాల శాస్త్రీయ నృత్య శైలులు, మరో నాలుగు రకాల సాంప్రదాయక నృత్య శైలులు సంక్రమించాయి. ఉత్తరాదిన కృష్ణభగవానునికి సంబంధిచిన లీలలు ఇతిహాసాలు భారత నృత్యం అనే శాస్త్రీయ నృత్యశైలిలో ప్రదర్శించాబడుతాయి. దీనిని కక్వారీ శైలి అని కూడా అంటారు. ఈ నృత్యశైలికి పీఠంలకో. గురం శంభూమహారాజ్ పూర్వీకుడైన గురు ఈశ్వరీప్రసాద్ జీ ఈనృత్యశైలిన్ని రూపొదించాడు.

దక్షిణాదిన తంజావూరువద్ద భరతనాట్యం రూపొందించబడింది. ఇది దేవదాసీలు చేసేనృత్యం దీనికి రెండు పీఠాలుఉన్నాయి. ఒకటి పండనల్లూరు, రెండవది మెలట్టూరు, మేలట్టూరునృత్యశైలికి సాదీర్ నృత్యం ప్రాతిపదికగా పరిగణించబడుతోంది, భరతనాట్యానికి పురాణకథలు వస్తువులు.

కేరళ రామనట్టానికి పుట్టినిల్లు ఈరామనట్టమ్ కథాకళిగా అభివృద్ధి చెందింది. చకియన్‌కూరు, కృష్ణాట్టం. నకియర్లకళ రామనట్టంకు జీవంపోశాయి. కొట్టక్కారా రాజారామనట్టంను రూపొందించాడని చెబుతారు. తూర్పు భారతంలో ఊహించి రూపకల్పన చేశాడని చెబుతారు.

## సాంప్రదాయక నృత్యాలు

సాంప్రదాయక నృత్యాలలో కూడా మతప్రభావ ఛాయలు కన్పిస్తాయి. రాజస్థాన్ కథక్ నృత్యం, ఒరిస్సాతాలూకు ఒడ్డిస్సి నృత్యం సాంప్రదాయక శైలికి చెందినవి. గురుశంభుమహారాజ్ మేనమామ అయిన లక్నో వాస్తవ్యుడు మహారాజ్ బందాదీన్ మహారాజ్ శిష్యుడు కీర్తిశేషులు హనుమాన్‌ప్రసాద్ జీకథన కథక్‌నృత్యాన్ని రూపొందించినట్లు ప్రతీతి. కథర్ నృత్యంలోకూడా భారతనాట్యంలోని కొన్ని గమకాలు ఉన్నప్పటికీ అదిచాలవరకు ఝుమార్ లనే రాజస్థానీ జానపద నృత్యంవరవడిగా రూపొందింపబడింది. ఒడ్డిస్సిఅనే ఒరిస్సా జానపద నృత్యశైలికి చైతన్య మహాప్రభు పూరీలో నివాసం ఏర్పరచుకున్న రోజుల్లో వైష్ణవ సంప్రదాయంద్వారా ఉద్దీపన లభించింది. బృందావన్ మహారాస నృత్యం, దేవదాసీల నృత్యశైలి యొక్క ప్రభావం దీనిపై బడింది.

బొంబాయి రాష్ట్రంలో రాన్‌గర్బ, తంజావూర్ బెంగుళూర్ లలో ఆటగురగ్రిం నృత్యం అనే రెండు సాంప్రదాయక నృత్యశైలులు ఉన్నాయి. రాజస్థాన్‌లో దీని రూపాంతరంగా కచ్చొహోరి అనే శైలి ఒకటి వెలిసింది.

చిత్రంలో నాలుగు శాస్త్రీయ నృత్యశైలుల తాలూకు భంగిమలను చూడవచ్చును. పైభాగంలో ఎడమ వైపునుంచి, భరతనాట్యం, భారతనృత్యం. దిగువభాగంలో ఎడమ వైపునుంచి మణిపురి, కథాకళి.

స్కాంద పురాణంలోని

# వజ్రాంగుని కథ.

-సాహిత్యరత్న పేరి సర్వేశ్వరశర్మ ఎం. ఏ-

దక్షప్రజాపతి భార్య వీరిణి, ఆమెకు దక్ష ప్రజాపతి వలన అరువది కన్యలు పుట్టిరి. వారిలో అశ్విని, భరణి మున్నగు నక్షత్రనామములుగల యిరువదు యేడు కన్యలను చంద్రునకు, భాను, లంబ, కకుత్తు, భూమి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసు, ముహూర్త, సంకల్ప యను పేర్లుగల పదిమంది కన్యకలను యమధర్మ రాజునకు, భూతునకు సురూప, విరూప యనుపేర్లు గల కన్యకలను, స్వధ, సనీచి యనుపేర్లుగల కన్యకలను అంగిరసునకు, భీషణ, అర్చి యను యిద్దరు కన్యలను కృశాశ్వునకు, పతంగి, యామిని, తామ్ర, తిమి, యనుపేర్లుగల నలుగురు కన్యకలను అరిష్టనేమికి, అదితి, దితి, వసు, సింహ, దనాయు, సురభి, అరిష్ట, వినత, గ్రావధ, క్రోధవశ, ఇర, కద్రు, ముని యను పేర్లుగల పదముగ్గురు కన్యలను కస్యప మహర్షికిని యిచ్చి దక్షప్రజాపతి వివాహము చేసెను.

యమధర్మరాజు భార్యలలో భానుకు ఇంద్రసేనుడు లంబకు విద్యోతుడు, కకుత్తుకు శకటుడు, భూమికి దుర్గడు, విశ్వకు విశ్వేదేవులు, సాధ్యకు ఎనమండుగురు సాధ్యలు, మరుత్వతికి మరుత్వంతుడు, సురేంద్రుడు అనుకుమారులు, వసువుకు ఎనమండుగురు వసువులు, ముహూర్తకు ముహూర్త కుమారులు, సంకల్పకు సంకల్పము పుట్టిరి,

భూతుని యిద్దరు భార్యలలో సురూపకు కపాలి, పింగళ, భీమ, విరూపాక్ష, విలోహిత, అజకు, శాసన శాస్త శంభు, అంత్య, భవ, అనుపేరులు గల ఏకాదశ రుద్రులు కల్గిరి. రుద్రుల పార్షదులంతా విరూప యొక్క సంతానము.

అంగిరసుని యిద్దరు భార్యలలో స్వధ అనునామె పితృదేవతలను, సనీచి అనునామె అధర్వాంగీరసుని కనిరి.

కృశాశ్వుని భార్యలగు భీషణ యర్చులకు అస్త్ర సమోహాము పుత్రుడై పుట్టెను. అరిష్టనేమి నలుగురి భార్యలలో పతంగి పక్షులను, యామిని, మిడతలు మున్నగు పురుగులను, తామ్ర, డేగాలను. రాంబందులను,తిమి తిమింగలము మున్నగు జలచరములనుకనిరి.

ఇక కశ్యప మహర్షి భార్యలలో, అదితి, సురులను కనెను దితి సంతానము దైత్యము. దనువుకు దానవులు పుట్టిరి. సింహికుమారుడు సింహికేయుడు (రాహువు) దనా యుగణము, దనాయు సంతానము, సురభికిగోవులు సంతానము అనూరుడు,గరుత్మంతుడు వినతపుత్రులు యుగంధరులు, అరిష్టకుమారులు, క్రూర జంతువులు గ్రావ సంతానము, క్రోధవశగణము క్రోధ వశ సంతానము. వృక్షజాతులు ఇరసంతానము: కద్రువ సంతానము సర్పములుఅప్సరోగణమంతయు ముని సంతానము.

హిరణ్యాక్ష. హిరణ్యకశిపులను దైత్యులు సురులచే చంపబడిన పిదప దితి కడు దుఃఖితురాలై, యింద్రుని హతమార్చు సామర్థ్యము గల కుమారుని ప్రసాదింపుమని భర్తను వేడుకొనెను. అప్పుడు కశ్యప మహర్షి, ఓ ప్రియురాలా, యింద్రుని జయించగల పుత్రుడు నీకు కావలసినయెడల వెయ్యి వత్సరములు నియమవ్రతురాలవై యుండుము. తప్పక నీ కోరిక యీడేరగలదని సమాధాన మిచ్చెను. భర్త సలహా ప్రకారము దితి సమాహిత చిత్తురాలై నియమ మందుండ నారంభించెను. ఈ సంగతి తెలుసుకొని యింద్రుడు దితి యొక్క గర్భ విచ్ఛేదము నెట్లయిననూ చేయనెంచినవాడై దితిని సమీపించి, అమ్మా నీ వద్దనేయుండి నీసేవ చేయదలచుకున్నవాడను, సెలవిమ్మని యడిగెను. దితి దానికి యనుమతింప దేవేంద్రుడామెను భక్తితో కొలచుచుండెను. ఇట్లు చాలా యేండ్లు గడచినవి, ఇక వెయ్యి సంవత్సరములకు పది సంవత్సరములు మిగిలియున్న వనగా దితి పరమానందముతో కూడినదై యింద్రుని సంబోధించి యిట్లు చెప్పెను. ఇక నావ్రతము పూర్తియైనదనియే నమ్ముము, నీకు తమ్ముడు పుట్టగలడు. వానితోసహా నీవు త్రైలోక్యరాజ్యము హాయిగా అనుభవింపగలవు అని అట్లు చెప్పి యామె పగటివేళ నిద్ర వచ్చుటచే నిద్రించ నారంభించెను. ఆ నిద్రా సమయములో నామె శిరోజములు పాదములకు తగుల్కొని యుండెను. ఇదే సమయమని యెంచి యింద్రుడు యోగమూర్తియై దితియొక్క జఠరమును ప్రవేశించియందలి

గర్భమును తన వజ్రాయుధముచే మొదటయేడు ముక్కలు చేసి యీ యేడు ముక్కలలో మరల యెక్కొక్క ముక్కను ఏడేసిముక్కలుగా ఛేదించెను ఇంతలో దితి నిద్రనుండి మేల్కాంచి, యింద్రా నా గర్భమును చంపకుమని కేకలు వైచుచూ బోరున యేడ్వసాగెను. అప్పుడింద్రుడు మారోదీః (ఏడవకుము) అనిచెప్పి జఠరమునుండి బయటకువచ్చి దితి కెదురుగా ప్రాంజలియై నిల్చి నిర్భయముగా ఓ తల్లీ, నేడు నీవు పాదాక్రాంత శిరోరుహవై పగటివేళ నిద్రించితివి. అదినీవు పట్టిన వ్రతమునకు విరుద్ధమైన పని. అందువలన నేను నీ జఠరమును ప్రవేశించి యందలి గర్భమును నలుబదితొమ్మిది ముక్కలుగ ఛేదించి యున్నాను. తమ్మునితో సహా త్రైలోక్య రాజ్యము ననుభవింపుమని నీవు చేసిన యాశీర్వాదము సత్యమగుగాక. మారోదీ అని చెప్పియుంటిని గావున యీ నలుబదితొమ్మిది గర్భాంశములు మరుత్తులను పేరుతో ప్రసిద్ధులై నాకు సహాయకులుగానుందురు గాక. వారియందరకు నంతరిక్షమున స్థానము గల్పించగలవాడనని చెప్పి యింద్రుడు మరుత్తులతో సహా వెళ్ళిపోగా దితి సిగ్గుచెందినదై యేమియు చేయజాలక భర్తయొద్దకు వచ్చి జరిగినదంతయు చెప్పి విలపించుచూ నాథా ఈసారి యింద్రుని చంపు కుమారుని ప్రసాదించితివా మంచిది లేనియెడల తత్‌క్షణమే నీ యెదుట మరణించగలను. అని చెప్ప కశ్యప మహర్షి దితియొక్క దీనావస్థను జూచి ప్రియురాలా పదివేల సంవత్సరములు నియమ వ్రతురాలవై తపస్సు చేసినయెడల నీకు వజ్రమువలె అభేద్యమైన యంగములుగల పుత్రుడు పుట్టగలడు. అని చెప్పెను. భర్తచెప్పిన ప్రకారము దితి పదివేల వత్సరములు గొప్ప నిష్టగలదై యుగ్రతపస్సు జేసెను. తపస్సు పూర్తియైన పిదప యామెకు వజ్రమువలె దుర్భేద్యమైన యంగములుగల పుత్రుడు గల్గెను. వానికి వజ్రాంగుడని నామకరణము జేసిరి. వజ్రాంగుడు బాల్యముననే సర్వ శాస్త్ర పారంగతుడయ్యెను. అతడు తల్లిని సమీపించి నేనేమి చేయవలయునని నీ కోరిక యని యడిగెను. అప్పుడామె పుత్రకా చాలమంది నీయన్నలు నీ సవతి యన్నయగు యింద్రునిచే హతము గావింపబడిరి. కావున నీవు వెంటనే వెళ్ళి యింద్రుని చంపి పగసాధింపుము. ఇదియే నా కోరిక. యని చెప్పెను. వెంటనే వజ్రాంగుడు అమరావతికి వెళ్ళి యింద్రుని జయించి సింహము నీచ మృగమును ఈడ్చుకొని వచ్చినట్లు వానిని బర బర యీడ్చుకొని తల్లి సమీపమునకు తీసుకొనివచ్చెను, ఇంతలో బ్రహ్మ కశ్యప మహర్షులచ్చటకు వచ్చిరి. మిక్కిలి దీనావస్థలో నున్నయింద్రుని జూచి బ్రహ్మ వజ్రాంగునితో నిట్లు పల్కెను.

ఓ వజ్రాంగా యింద్రునకు నీవిప్పుడు చేసిన యవమానము చాలును. ఇక వానిని చంపుట వ్యర్థము అతడు జీవించి యున్ననూ మరణించిన వాళ్లలో జమే. యుద్ధ భూమిలో శత్రువుని జంపుటకంటె వానిని హెచ్చుగ యవమానించి విడుచుట గొప్ప. మరియు తల్లి యాజ్ఞను శిరసా వహించి యింద్రుని జయించినట్లే తండ్రి యాజ్ఞను కూడ శిరసా వహించి వానిని విడచివేయుట మంచిది. అప్పుడు వజ్రాంగుడు ప్రాంజలియై బ్రహ్మతో నిట్లుపల్కెను :-

ఓ పరమేష్ఠీ, నాకింద్రునితో పనియేమియులేదు. తల్లి కోరిక దీర్చితిని. అంతే చాలును. నీవు సురాసురులకు నాథుడవు. నాకు పితామహుడవు, నీ మాట ప్రకారము ఇదిగో యింద్రుని విడుచుచున్నాను చూడుము. ఇతరులచే ననుభవింపబడిన స్త్రీ వలెను, ఇతరులచే ధరింపబడిన మాల వలెను, ఇంద్రునిచే ననుభవింపబడిన త్రైలోక్య రాజ్యము నాకక్కరలేదు. ఈ మూడు భువనముల యొక్క సారమేదియో చెప్పుము. నాకంతియే చాలును, అప్పుడు బ్రహ్మ, ఓ పిల్లవాడా ఈ మూడు లోకములలోను తపస్సుకంటె గొప్పది వేరొకటిలేదు. తపస్సు చేతనే యెల్ల కార్యములు సాధింపబడుచున్నవి. నీవు నిజముగ తపస్సునకు తగిన వాడవు కూడ అని చెప్పెను. అప్పుడు వజ్రాంగుడు, ప్రభూ, నాకు తపస్సు అనిన పరమప్రీతి. నీ యనుగ్రహము వలన నా తపస్సుకు విఘ్నములు కలుగవనియే నా నమ్మిక యని విరమించెను. అపుడు బ్రహ్మ, ఓ మనుమడా, క్రూరభావమును విడచి చిత్తశుద్ధితో తపస్సుచేయుము. నీ జన్మ సఫలము కాగలదు. అని చెప్పి వరాంగి యను అందగత్తెను సృష్టించి వజ్రాంగునికిచ్చి పెండ్లి జేసి కశ్యపమహర్షితోసహా స్వర్గమునకు వెడలిపోయెను. అనంతరము వజ్రాంగుడు భార్యా సమేతుడై వనమునకు వెళ్ళి వెయ్యి సంవత్సరములు బాహువులను పైకెత్తి తపస్సుచేసి, యనంతరము అధోముఖుడై

వేయి సంవత్సరములు తపస్సుచేసి, తదుపరి నీటిలో ప్రవేసించి వెయ్యి వత్సరములు తపస్సు చేయ నారంభించెను. జలములో ప్రవేసించి భర్త తపస్సు చేయుచున్న సమయమున వరాంగి సరస్సు ఒడ్డున కూర్చొని మౌనము వహించినదై తపస్సు చేయ నారభించెను. ఆసమయమున యింద్రుడచటికి వచ్చి కోతి, పాము, నక్క మున్నగు వివిధ రూపములను ధరించి యామె తపస్సుకు విఘ్నము కలుగజేయ నారంభించెను. వరాంగి మౌనము వహించి పరమ శాంతిని గల్గియున్నదై యించుకొంతయైననుకోపించి యుండలేదు. అంతతో చాలించక యింద్రుడు వైశ్వానరరూపమును ధరించి యాశ్రమమును దగ్ధముచేసి ఝంఝూవాతమును చెలరేగించెను, మరియు సింహము, తోడేలు మున్నగు రూపములను ధరించి యామెను భయపెట్టి నానా భీభత్సము చేసెను. చివరకామె యోర్వలేక మిక్కిలి కోపించినదై తామాశ్రయించిన పర్వతము యొక్క దోషమువలన నివన్నియు గల్గుచున్నవేమో యని భ్రాంతిపడి పర్వతమును శపింపబోవ యాపర్వతము మనుష్య రూపము ధరించి యామెను సమీపించి, అమ్మా నాదోషమేమియులేదు. దేవరాజైన యింద్రుడింతవరకిన్ని విచిత్ర రూపములను ధరించి మిమ్ములను హింసించియున్నాడు అని చెప్పెను. ఇంతలో వెయ్యి సంవత్సరములు పూర్తియగుటచే బ్రహ్మ యా సరస్సు వద్దకు వచ్చి ఓ వజ్రాంగా నీతపస్సుకు నేను చాల మెచ్చితిని. ఇకలెమ్ము నీ కోరికలన్నీ నేను తీర్చెదను అని పల్కెను. పితామహుని మాటలను విని వజ్రాంగుడు జలాశయమునుండి లేచి చేతులు జోడించినవాడై బ్రహ్మతో నిట్లు పల్కెను.

ఓ పితామహా, నాకసుర భావము లేకుండుగాక దేవరాజ్యమందు నాకెంతమాత్రమభిలాష లేదు. ఇంకను తపస్సునందే నాకు రతిగలుగాక యని కోరుకొనెను. అంత బ్రహ్మ నీవు కోరినట్లే యగుగాక యని విస్మిత మనస్కుడై చెప్పెను. జరుగబోవుదానిని యెవరతిక్రమించగలరు? చివరకు నేను శివ విష్ణువులు కూడ యతిక్రమింప జాలమని యనుకొని యచటనే యంతర్ధానము జెందెను, అనంతరము వజ్రాంగుడు ఆహారము తీసుకొనుటకై తన యాశ్రమము వద్దకురాగా యది దగ్ధమైయుండెను. భార్య వరాంగి యచట కనపడలేదు. యిదేమి మోసమని చింతించుచు యామెకొరకై వనమంతా వెదకుచు నొక చెట్టుక్రింద కూర్చొని యేడ్చుచున్న తన ప్రియురాలను గాంచి యాశ్చర్యపడి, వరాంగీ నేను బ్రతికి యుండగ నీవు కంట నీరు పెట్టుటయా, నీకెవరేమి యపకారము చేసిరి? నీవిట్లు యేడ్చుటకు కారణమేమియో చెప్పుము. మరణ పర్యంతము భర్తతో సహా సుఖ దుఃఖములననుభవించు భార్య యొక్క కోరికలను తీర్చలేని భర్త యొక్క జన్మ యెందులకు? కావున నీకు కల్గిన కష్టమేమిటో చెప్పమని యడిగెను.

అప్పుడు వరాంగి, ఓ నాధా, నీవు సరస్సులో మునిగి వెయ్యి సంవత్సరములు తపస్సు చేయుచున్న సమయములో నింద్రుడనేక ఘోర రూపములను ధరించి నన్ను నానావిధముల హింసించెను. నేననాధవలె వానిచే పీడింపబడితిని. గొప్ప దుఃఖము ననుభవించితిని. ఈ దుఃఖమునుండి నన్ను తరింపజేయు కుమారుని ప్రసాదించితివా సరి లేనియెడల యిదుగో నీ యెదుటనే ప్రాణములను విడుచుచున్నదానను. అని పల్క వజ్రాంగుడు తనకెట్టి కోరికలు లేనప్పటికీ భార్య కోరిక తీర్చుటకై తిరిగి ఘోరమైన తపస్సు చేయనారంభించెను. ఇంతలో బ్రహ్మ యచటకు వచ్చి ఓ మనుమడా యింతవరకు నిరాహారుడవై తపస్సు చేసి యిప్పుడేకద ఆహారము తీసుకొనుటకై వచ్చియుంటివి? ఇంతలో నేమి వచ్చిపడినదని, మరల తపస్సు చేయనారంభించినావు? అని యడుగగా వజ్రాంగుడు ప్రాంజలియై ఓ పితామహా నేనిప్పుడు నా భార్య కొరకై తపస్సు చేయుచున్నాను. సురుల దర్పమణచునట్టి పుత్రుడు కావలయునని నాభార్య కోరినది. అట్టి పుత్రుని బొందుటకై తపస్సు చేయుచున్నానని సమాధానము చెప్పెను. వజ్రాంగుని మాటలను విని పద్మ గర్భుడు వత్సా యిక తపస్సు చాలింపుము. శరీరమునంతగా క్లేశపెట్టుకొనకుము నీ భార్యయొక్క కోరికను దీర్చగల కుమారుడుదయించగలడు. అని చెప్పి అంతర్ధానము జెందెను. వజ్రాంగుడు యింటికి తిరిగివచ్చి భార్యను సంతోషపెట్టెను.





# రాజకీయాలు

శ్రీమతి వారణాసి యశోదాదేవి

### ఎగుమతులు

ఎగుమతులు హెచ్చిన గాని ప్రస్తుతపు మారకపు స్థితి బాగుపడదని బొంబాయిలో కేంద్రవాణిజ్య పారిశ్రామిక శాఖా మంత్రి లాల్ బహదూర్‌శాస్త్రి అన్నారు. ఎగుమతుల బాధ్యత ఇన్స్యూరెన్సు కార్పొరేషను యేర్పాటు చేయబడినది.

### ఈజిప్టు ప్రెసిడెంటు నాసర్

ఈజిప్టు- ప్రెసిడెంటు నాసర్ 18 రోజుల పాటు సోవియట్ రష్యాలో పర్యటించి రాగా 50, 000 ప్రజలు ఆయన భవనం దగ్గర స్వాగతమిచ్చారు. లెబానన్ గూర్చి నాసర్ అభిప్రాయము- అచటి ఒడుదుడుకులు అన్యాయమును ప్రతి ఘటించుచున్న ప్రజల తిరుగబాటు- ప్రజలకు నచ్చింది. నాసర్ అల్జీరియనుల స్వాతంత్ర్య సమగములో సంపూర్ణముగ సాయపడుదుననిరి.

### పాకిస్తాన్ పాక్

ప్రభుత్వం సింధుజల వినియోగ వివాద పరిష్కారమునకై 1954 లో ప్రపంచ బ్యాంకి చేసిన ప్రతి పాదనలను అంగీకరించుటకు, సింధు లోయలోని సరఫరా, నిలువ మున్నగు వాటికై నిర్మించవలసిన లింకు కాలువలకు అగు ఖర్చును భారత ప్రభుత్వం భరించుటకు హామీ యివ్వనతెనను ప్రతిపాదనను, వదులుకొన్నదట.

పాకిస్థాన్‌లో యే విషమ పరిస్థితి వచ్చినా, ప్రజల దృష్టిని అన్యథామరల్చుటకై కాశ్మీరు సమస్యపై ఆందోళన రెచ్చగొట్టుట పరిపాటియైనది. డా. ఖాన్ సాహెబు హత్యతో పాక్ - రాజకీయాలు విషమించినవి. దేశంలోని కల్లోలమునకు ఫిరోజ్ ఖాన్ నూన్ మంత్రి వర్గం కారణమని ముస్లిము నాయకుల భావన, అస్థిరతకు బాధ్యత ప్రెసిడెంటు మీర్జాదే అని ముస్లింలీగు అధ్యక్షుడు రావల్పిండిలో ప్రసంగిస్తూ అన్నారు, కాశ్మీరు పరిష్కారాన్కి ఇండియాతో యుద్ధం తప్పదన్నారు, పాక్ ప్రధాని, మరి ముగ్గురు మాజీ ప్రధానులు- చంద్రిగర్, సుహ్రావర్దీ, చౌదరీ మహమ్మదాలీలతో యేర్పాటైన కాశ్మీర్ కమిటీ కరాచీలో సమావేశమై కాశ్మీరు, సింధు జలముల తగాదాలను యుద్ధము ద్వారా పరిష్కరించుటకు నిశ్చయించింది. కాశ్మీరు విమోచన సంఘం ఆర్గనైజరు చౌదరీ ఘులాంఅబ్బాస్, జమ్మూ, కాశ్మీరులను పాక్‌లోవి లీనం చేయుటకు ప్రధాని నూన్‌తో సంప్రతించి. చర్యలు తీసికొందుమని ప్రకటించిరి. ఆజద్ కాశ్మీరు నుంచి ప్రజలు జట్లు జట్లుగ కాశ్మీరు ప్రవేశింతురట. ఈ ఆర్భాటములు ప్రజల దృష్టిని స్వవిషయముల నుండి మరల్చుటకేమో!

### పాక్, ఇండియా సరిహద్దు

సిలూట్ - సచార్ దాటి, టీ ఎస్టేటులోనికి వచ్చి, మదన పూర్‌లో కాల్పులు సాగించారు పాకి సైనికులు, జూన్ 1 న వీరు తూర్పు పాక్, అస్సాం సరిహద్దులోని గ్రామములను, పంజాబు సరిహద్దుకు ఆవలివైపు నుంచి కాల్పులు జరిపిరి. పంజాబ్‌లో ఫిరోజ్ పూర్ జిల్లాలో ఫజిల్కా వద్ద యిండియాకు చెందిన పంట చేలను ఆక్రమించుటకు పాక్ సైనికులు రాగా సరిహద్దు పోలీసులు అడ్డగించిరి. అంతలో పాక్. సైనికులు తుపాకులు ప్రేల్చి. 7 గురిని చంపి, 15 మందిని ఖైదు చేసిరి. కరాచీకి 20 మైళ్ల దూరంలో జరిగిన థట్టా జిల్లాలోని మా పుర్‌ఖాస్ర్రో తాలూకాలోని వృత్త కలహములలో హిందువులు చాల నష్టమయిపోయిరి.

ఇటీవల కేంద్ర రక్షణశాఖ మంత్రి కృష్ణమీనన్‌గారు శ్రీనగర్‌లో ప్రసంగిస్తూ, పాకిస్థాన్ అన్ని విధముల యుద్ధ విరమణ ఒడంబడికను భగ్నపర్చినది "ఇండియా యెంతో సహనంతో ప్రతీకారం తల పెట్టకుండా భరిస్తోంది; ఈ ఓర్పు శాంతి విధానములకు కట్టుబడి యుండుట వల్లగాని, దౌర్బల్యం మాత్రం కాదని పాకిస్థాన్ గ్రహించాలి అన్నారు. మద్రాసులో శ్రీ మీనన్, "యిండియా యితరులపై కత్తి దుయ్యదు, కాని యితరులు హత్య చేయుటకు వస్తే చేతులు ముడుచుకొని కూర్చోదు" అన్నారు.

## పుదుచ్చేరి ప్రభుత్వము

మే 22 న పాండిచ్చేరి ప్రభుత్వపు కౌన్సిలు రద్దు చేయబడినది. చీఫ్ కమిషనర్ యమ్. కె. కప్పలాని 6 గురు కౌన్సిలర్ల రాజీనామాలు యంగీకరించిరి. ఆగస్టులో తిరిగి కౌన్సిలు యెన్నికల వరకు, ఛీఫ్ కమిషనర్ రాజ్యం నడిపింతురట.

## బర్మా

ప్రధాని ఊనుచే 20 మంది సభ్యులతో క్రొత్త పార్ల మెంటు మంత్రి వర్గము యేర్పాటు చేశారు. ఇతని పట్ల విశ్వాసం ప్రకటించింది, ఉబాస్వే ప్రతి పాదించిన అవిశ్వాస తీర్మానమును పార్లమెంటు తిరస్కరించింది.

## రాష్ట్ర కాంగ్రెసు ప్రభుత్వములు

ఒరిస్సాలో గవర్నరు కోరికపై శ్రీ హరికృష్ణమహ తాబ్ మే 9 వ తేదీన యిచ్చిన మంత్రి వర్గపు రాజీ నామాను మే 24 న వుపసంహరించుకొనిరి.

పంజాబులో సర్దార్ ప్రతాపసింగ్ కైరాన్‌పై, ఆయన చేసిన నికృష్ట చర్యల ఫలితముగ ప్రజాభిమానము గోల్పో యెనని కాంగ్రెసు పార్టీ ప్రచారం చేసింది. కాంగ్రెసు అధిష్టాన వర్గం విచారణసల్పగా ఆరోపణలు నిరాధారమని తేలింది. ఈ "గాలి దుమారం" వల్ల కైరాన్ ప్రతిష్టయిను మడించినదేమో గాని కాంగ్రెసు లెజిస్లేచరు పార్టీ యల్లరి పాలైనది. ఇట్టి సందర్భములలో ప్రజా రంజనముగ పరి పాలన సాగుట కష్టము గదా! మంత్రి వర్గంలో వుండి ముఖ్య మంత్రిపై తిరుగబాటు ప్రోత్సహించుట తప్పుకదా! ఇట్టి పరిస్థితులు మరి కొన్ని చోట్ల సంభవిస్తే, కాంగ్రెసు సంస్థ చాల నష్టపోగలదు.

మంత్రి వర్గ పునర్నిర్మాణం కేంద్ర కాంగ్రెసు పార్ల మెంటరీ బోర్డు సలహా, సంప్రతింపులతో జరుగునని శ్రీ కైరాన్ చండిగర్‌లో అన్నారు.

## ఆంధ్ర ప్రదేశ్

ఆంధ్రలో సెంట్రల్ పార్లమెంటరీ బోర్డు వారి యంతిమ నిర్ణయమునకు వేచియుండక లెజిస్లేటివు కౌన్సిలుకు కాంగ్రెసు అభ్యర్థులను యెన్నుకొనుట సరిగా జరుగలేదని ఆంధ్ర కాంగ్రెసు వర్గం నుండి కొందరు రాజీ నామా యిచ్చారు. ఇది చాల శోచనీయము, వీరు రాజీ నామాలు వుపసంహరించుకొని కాంగ్రెసులో సమైక్య భావం నెలకొల్పుటకై తోడ్పడ వలసియున్నది.

## స్త్రీ విద్యా సంఘం

స్త్రీ విద్యకు సంబంధించిన ప్రత్యేక సమస్యల పరిశీలించు టకై శ్రీమతి దుర్గాబాయి దేశముఖ్ (కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘాధ్యక్షురాలు) ఛైర్‌మన్‌గ ఒక నేషనల్ కమిటీని భారత ప్రభుత్వం యేర్పాటు చేసింది. ఈ కమిటీ దేశంలో పర్యటించి సమాచారములు సేకరింతురు.

## అణ్వస్త్రములు

మే 24 న అమెరికన్ ప్రెసిడెంటు, యు. యస్. బ్రిటను, ఫ్రాన్సు, రషియా ఎక్స్‌పర్ట్సు జినీవాలో 3 వారాలలో కలిసికొని అణ్వస్త్రముల పాటవ పరీక్షల నిలుపుదలను గూర్చి యాలోచనల చేయవలెనని సోవియటు యూనియనుకు ప్రతిపాదించిరి. ఈ విషయమును గూర్చి బ్రిటను, అమెరికాల వైఖరి చాల ఆశాభంగం కల్గించినదని సోవియటు ప్రధాని కృశ్చేవ్ బ్రిటనులోని హైడ్రోజన్ బాంబు నిషేధోద్యమ నాయకులకు వ్రాసిరి. ఈ అణ్వస్త్ర పాటవ పరీక్షల నిషేధంపై జరుగగల ఒడంబడిక సక్రమంగ పాటింప బడునట్లు తనిఖీ చేయుటకు కావలసిన యేర్పాట్లను గూర్చి జరుగగల చర్చలలో చైనా, యిండియా. పోలెండు, జెకోస్లోవాకియాలు పాల్గొన వలెనని అమెరికా, రష్యాల యభిప్రాయమైయున్నది.

## ఉపగ్రహములు

ఈ సంవత్సరాంతంలోగా ప్రయోగాత్మకంగా రెండు రాకెట్లను చంద్రమండలమునకు పంపుటకు అమెరికన్ రక్షణ శాఖ సన్నాహములను చేస్తోంది. 130 పౌ, బరువు గల ఒక కృత్రిమ గ్రహమును కూడ అమెరికా రోదసి లోనికి పంపగలదట.

## స్పుట్నిక్‌లు

జూన్ 4 న అమెరికా సెనెటుకు చెందిన ప్రత్యేక రోదసి సమస్యల పరిశీలన సంఘమునకు అందజేయబడిన నివేదికలో రష్యనులు రెండవ స్పుట్నిక్‌లో లైకా కునక మును వుంచి ప్రయోగింపక ముందే, చాల కుక్కలతో రోదసీ యానమునకు సంబంధించిన పరిశోధనలు జరిపిరని గలదు. 1951 లోనే వారు వాయు మండలములోనికి కునక ముల బంపిరట.

## సింహళము

సింహళం వుత్తర రాష్ట్రంలో అల్లరులు చెలరేగినవి. వుత్తర ప్రాంతములోనున్న సింహళములను దక్షిణాదికి మార్చుటకు ప్రయత్నములు జరిగినవి. జాఫ్నాకు సింహళపు

. అకారణంగ తమ భూభాగంపై కాల్పులు జరుపుట తాము సహించలేనంతటి చికాకు పుట్టించే చర్యగా పరిగణిస్తున్నట్లు యిండియా ప్రభుత్వం పాకిస్థానుకు తెలియజేసింది. రాడ్క్లిఫు తీర్పును అమలు పర్చుటలో ఇండో-పాక్ సరిహద్దుల గూర్చిన వివాదములను చర్చల ద్వారా నిర్ణయించ వచ్చునన్నారు ప్రధాని నెహ్రూ, 1962 నాటికి రాజస్థాన్ దిగువ సరోహింద్ కాల్వలు పని చేయుట ప్రారంభించును అప్పటికి పాక్. వాటితో స్వంత ఏర్పాట్లు చేసికొనవలెనని భారత ప్రభుత్వం ప్రపంచ బ్యాంకికి తెలియ జేసింది.

## ఇండోనేసియా

యు. స్. ప్రభుత్వము ఇండోనేసియను ప్రభుత్వమునకు 500, 000 డాలర్ల విలువ గల విమాన సంబధమైన సామాగ్రి, రక్షణ సహాయం చేయుటకు నిశ్చయించింది.

## లెబానన్ లో

లెబానన్లో కల్లోలం ప్రభుత్వమును బలపర్చు క్రైస్తవులకు, ప్రభుత్వవ్యతిరేక వర్గములను బలపర్చు ముస్లిములకు మధ్య మత యుద్ధముగా పరిణమించవచ్చును, లెబానన్ అరబ్ యునైటెడ్ రిపబ్లికు వివాద పరిష్కారమునకు ఏడు రాజ్యములు అరబ్ లీగు కౌన్సిలుకు అందజేసిన తీర్మానమును లెబానీస్ ప్రతినిధి వర్గం త్రోసిపుచ్చినది.

## యుగోస్లావియా

టిటో ప్రభుత్వమునకు సోవియటు యూనియను ఆర్థిక సహాయము నిల్పుట వలన యుగోస్లావియా రష్యాకు నష్ట పరిహారము కోరినది. సోవియటు ప్రధాని కృశ్చేవ్ నీతి నియమములులేని వ్యక్తి యనియు, సోవియటు కూటం రాజ్యాలు యుగోస్లావియాను నిర్దాక్షిణ్యముగ యొత్తిడి చేయుచున్నదనియు యుగోస్లావియా ప్రభుత్వముఅన్నది.

## అల్జీరియాలో

అల్జీరియాలో జనరల్ ఎన్నికలు రాజ్యాంగ సంస్కరణలపై, రెఫరెండమునకు పిమ్మట జరుగగలవట, అల్జీరియాలో ప్రశాంతి యేర్పడినను, జనరల్ డీగాల్ రూపొందించిన పథకం ద్వారా యచటి సమస్యల పరిష్కారం సాధ్యపడక పోవచ్చును, మే 22 న టునీసియాలో యుద్ధం జరిగినది, ఫ్రెంచి విమానములు టునిస్కు దక్షిణముగ, అల్జీరియా తూర్పు సరిహద్దుకు 20 మైళ్ళు తూర్పుగ నున్న గెఫ్సా మీద బాంబులు ప్రేల్చిరి.

## ఫ్రెంచి ప్రభుత్వం

రెండవ ప్రపంచ యుద్ధములో ఫ్రెంచి స్వాతంత్ర్య నాయకుడైన జనరల్ డిగాల్ ఇప్పుడు ఫ్రాన్సుకు ప్రధాన మంత్రి యయ్యెను. ఇతని యుద్ధం పిమ్మట 26 వ మంత్రి వర్గము. ఈయన వయస్సు 67 సం॥ లు, కారణ జన్ముడనని భావించుచుండును; మేరలేని దురహంకారి; అన్యాభిప్రాయముల సహించ నేరడు. చర్చిల్, రూజువెల్టులకు అతి విషమ పరిస్థితులలో కంటక ప్రాయుడైనాడు. హిట్లర్ ధాటికి ఫ్రెంచి సైన్యములు చలించినప్పుడు "ఫ్రెంచి పౌరుడు ఒక్కడైనా జీవించి యున్నంత వరకు ఫ్రాన్సుకు పరాజయంలేదని" చాటిన ధీరుడు డిగాల్, నాడు ఫ్రెంచి ప్రతి ఘటనకు ప్రాణంబోసి ఫ్రాన్సు గౌరవం నిలబెట్టి, నాజీ జర్మనీ పరాజయము పొందగనే. ఫ్రాన్సు ప్రధాని ప్రెసిడెంటు అయ్యెను.

ఈ పదవుల వల్ల డిగాల్ అతిశయం యధికమై 1944 లో తన యధికారమును శక్తియుక్తులను ఫ్రెంచి రాజ్యాంగ సవరణకు, అమెరికా ప్రెసిడెంటుకున్న యధికారములను ఫ్రెంచి ప్రసిడెంటుకు సంపాదించుటకు వినియోగించెను, తన ప్రయత్నము సఫలము కానందున 1946 లో రాజకీయముల నుండి విరమించి, 1953 లో రాజకీయ రంగం నుండి నిష్క్రమించినట్లు ప్రకటించియు, తన పరతులపై రాజ్యాధికారము స్వీకరించుటకై వేచియుండి, నాజీ జర్మనీకి ప్రతిఘటనకు తాను కేంద్రముగ జేసికొన్న అల్జీరియా మూలంగ, అట్టి తరుణంగానే అవకాశం పుచ్చుకొనెను.

డిగాల్ ప్రజాసామ్యవాది కాడు; నియంత ప్రజాక్షేమం ప్రజలకంటె తనకే యెక్కువ తెలియునన్న భావం గల్గియున్నాడు, ఫ్రెంచి రాజ్యాంగ విధానమును రాజ్యాంగ బద్ధమైన పద్ధతులపై సవరించుటకు యేడాది టైము కోరెను, ఇతడు ప్రతి పాదించిన రాజ్యాంగ సంస్కరణల బిల్లును నేషనల్ అసెంబ్లీ ఆమోదించి, సర్వాధికారములు యతనికి కట్టబెట్టి యింక 6 మాసముల వరకు సమావేశము కాబోదు.

టునీసియా, మొరాకోలకు ఫ్రాన్సుకు మధ్య స్నేహ పాశములు పెంపొందింప జేయుదునన్నాడు. డిగాల్, ఇతని యధికార స్వీకృతి ఫలితంగ వుత్తర అట్లాంటిక్ రక్షణ వ్యవస్థలో క్లిష్ట పరిస్థితులు తప్పదనియు, బ్రిటను, అమెరికాలకు సందిగ్ధస్థితి తెచ్చిపెట్టిందని బ్రిటను యభిప్రాయ పడుచున్నది.

తమిళుల తరలింపు జరుగుచున్నది. జూన్ 3న 45.00 తమిళ కాందిశీకులతో 6 ఓడలు కొలంబో నుండి వుత్తర జాఫ్నాకు వెళ్ళినవి, 10 రోజుల తర్వాత రైళ్ళ రాక పోకలు తిరిగి ప్రారంభమైనవి. తలైమన్నార్ జాఫ్నా, బాటికోలాలకు జూన్ 9 న బయల్దేరిన రైళ్ళు కాందిశీకులతో నిండినవి.

జాతి మత విచక్షణలేకుండ సమస్త ప్రజల పట్ల న్యాయంగా వ్యవహరించుటకు తన ప్రభుత్వం కంకణం కట్టుకున్నదని సింహళ ప్రధాని సాలమన్ భండర్ నాయకే కొలంబోలో జూన్ 4 న ప్రతినిధుల ప్రత్యేక సభా ప్రత్యేక రహస్య సమావేశంలో చెప్పిరి.

## పండరిపుర సమావేశములు

పండరిపురంలో జరిగిన అఖిల భారత సర్వోదయ సమ్మేళనములో ప్రసంగిస్తూ పసిడెంటు రాజేంద్రప్రసాదు గ్రామ రాజ్యస్థాపనలోను శాంతిసేవా నిర్మాణంలోను స్త్రీలు ముఖ్యపాత్ర వహించవలెనని కోరిరి. భారతదేశం సర్వోదయ సిద్ధాంతము ప్రాతి పదికగా తన సంఘమును పునర్నిర్మాణం విజయవంతంగా సాధిస్తే ప్రపంచ దేశములలో తన విశిష్టస్థానమును కల్పించు, కొనగలదనిరి.

ఆచార్య వినోబాభావే వుపన్యసిస్తూ వున్నతయాధ్యాత్మిక, నైతిక స్థాయిగల యిండియాకు జైహింద్ నినాదం సంకుచితముగ గన్పించుచున్నదనియు, దాని, స్థానమున విశ్వమున కంతటికి వర్తించే జై జగత్ నినాదం ఆక్రమించవలెనని సూచించిరి. భారత దేశం ప్రపంచమునకు యివ్వవలసిన, నిర్వహింప వలసిన నిద్యుక్తధర్మం గలదనియు, సర్వైక్య సందేశం అన్ని దేశాలకు వ్యాపించిరి అన్నారు.

## పరిశ్రమలు

ఇండియా. అమెరికాల మధ్య వాణిజ్య నౌకల సర్వీసు జులై నుండి ప్రారంభం కాగలదట. ఇందులకై సింధియా కంపెనీ వారు 4 నౌకలతో తగిన యేర్పాట్లు చేసిరి. దాదాపు నూరేండ్లకుపైగా నిర్లక్ష్యము చేయబడిన ఒరిస్సాలోని ప్రదీలిరేవును జపానుకు చెందిన "యస్. యస్. గోల్డెన్ కప్పా" వ్యాపారమునకు వచ్చుట వలన, యిండియాలోమరొక క్రొత్తరేవు వినియోగంలోకివచ్చింది. ఒరిస్సాలో మహానదీ ముఖద్వారములో నున్న ప్రదీప రేవు కేంద్ర. ఒరిస్సా ప్రభుత్వములచే మరమ్మతు చేయబడినది. ముడి యినుము దొరకు ప్రాంతములకు సమీపములో నుండుట వలన యీ రేవు చాల వుపయోగకరమైనది.

కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయవికాస కేంద్రములకు ద్వితీయ ప్రంచవర్షప్రణాళిక కాలంలో యవసరమైన సిబ్బంది 350, 000 మంది యని అంచనా వేయబడినది.

ఆంధ్రలో గత 6 మాసములలో 213 పోస్టు ఆఫీసులు, 10 టెలిగ్రాఫ్ ఆఫీసులు. ప్రారంభించిరని తంతి, తపాలా ప్రాంతీయ మహా సంఘం 18 వ సమావేశంలో. ఆంధ్ర తంతి తపాలా శాఖా డైరక్టరు శ్రీ శివానందరాజు వెల్లడించిరి. ఆంధ్ర జిల్లాలలో 1958-59 లో 2o. 000 మందికి అంబర్ చర్కా నూలు తీయుట నేర్పి అంబర్ చర్కాలను పంచిపెట్టవలెనని వుద్దేశిస్తున్నారట.

రాయపూర్ లో హిందుస్థాన్ వుక్కు కంపెనీ చైర్మన్ జి. పాండే ప్రసంగంలో భిలాయ్, రూర్కెలా ఫాక్టరీలల్లో యీ సం॥ అంతంనుంచి దుక్కయినుము వుత్పత్తి ప్రారంభమగునని చెప్పిరి.

## ప్రాచీన నగరములు

ఉత్తర సిరియాలో యూఫ్రటిసు రాష్ట్రంలో రక్కా. అనో చోట ప్రాచీన నగర శిధిలములు కనుగొన బడినవి. నగర వైశాల్యము 35 చ. మైళ్ళు, దాని పేరు రఫిఖ్, శిధలములలో కలీఫాఅరు ఆల్ రషీద్ కాలపు అంతఃపుర భవనములు, అమూల్యమైన గాజు, మట్టి సామాగ్రి దొరకినవి. అంతఃపుర వుద్యావన చిహ్నములు గూడ గలవు.

చైనాలో నాన్‌కింగ్ నగరం సరిహద్దులలో యిండోనేషియాలోని కాళి మంటన్ రాజు మానన్యగాన్ సమాధి కను బడెనట. 1408 లో యీ రాజు చైనాలో పర్యటిస్తూ తన 28 వ యేటమరణించెనని, అప్పటి చైనా చక్రవర్తి మింగ్ యీ రాజునకు రాజ లాంఛనములతో నంత్యక్రియలు జరిపించెనట.






## మా మల్లిబాబు

బి. వి. నరసింహారావు, బి.ఎ., బి.ఇడి.

మాటలు ఎన్నో
మల్లికి వచ్చును
మాటల తీయను
మధురిమనిచ్చును.

పాటలు ఎన్నో
బాబుకి వచ్చును
పాడితె కోయిలె
బాగుగా మెచ్చును.

ఆటలు ఎన్నో
అతనికి వచ్చును
అందుకు మెచ్చును.
అల్లరి యెంతో

ఆడితె నెమలియు
అబ్బురు వచ్చును
అందుకు నైయన
అబ్బుర మిచ్చును.

చేతలు ఎన్నో
చిన్నకు వచ్చును
చేసిన గొప్పను
చెప్పగ వచ్చును.

మా మల్లిబాబు అల్లరి మహా జాస్తి అయిపోయింది. అల్లరి మానితే అతడు పిల్లవాడేకాదు. 'మూగ దేవుడులా, మూల కూర్చో'- అంటే కూర్చోడు. కదలాలి, గంతులు వెయ్యాలి. ఇష్టంవచ్చినట్లు అటు ఇటు తిరగాలి. వారిని వీరిని ఏదైనా అనాలి. అడగాలి.

అంతలో ఆస్థితి మారుతుంది. వింత వస్తువులు, విలువైన వస్తువులు కోరుతాడు. మారాంచేస్తాడు. 'ఐస్ ఫ్రూట్' కావాలంటాడు. బొంగరమన్నా, బుడగన్నా కొనమంటాడు. మూడుచక్రాల సైకిలంటాడు. మోటారు కారే తెమ్మంటాడు. బూటులూ, బూరలూ అంటే

మోజు పడతాడు. చిన్న బంతి, చిన్న బ్యాటూ తెమ్మంటాడు బాబు కోరికలకు అంతూ దరీ వుండదు. కోరిక అంటే అతనికి గుప్పెట్లో పనిగా తోస్తుంది.

తరువాత మల్లిబాబు దృష్టి మారుతుంది. కొత్త వస్తువుల వైపుకి కోరిక సాగుతుంది. "ఇంకో పుస్తకం ఏమన్నా పుస్తకం" కావాలంటాడు. "బొమ్మల పుత్తకాలే మంచి పుత్తకాలే" కావాలంటాడు. బొమ్మల పుస్తకాలు అడిగి తీసుకొని, ఆప్యాయంగా చూస్తూ, ఆ బొమ్మలతో కమ్మ కమ్మగా కబుర్లు మాట్లాడడం ప్రారంభిస్తాడు. ఆ మాట్లాడే తీరు ఒక కథకీ, కావ్యానికీ వస్తు సామగ్రి అవుతుంది. ఆ మాటల తీరు చాటున పొంచుండి వినాలి. సంతోషించాలి.

— "అ( మనం ఆడుకుందామే? అప్పుడు నాన్నా అమ్మా వత్తారుకదూ? అన్నయ్యా, పాపా కూడా వత్తారు. నేను నాన్నే. అన్నం పెట్టు ఆపీసుకెళ్ళాలి. కాలేజిలో వప్టుపారం చదువుతున్నాను కదూ? బి ఏ. కూడా చదువుతున్నా. మళ్ళీ కారు నడుపుతా. పైకెళ్ళిపోతుంది. విమానంమీద అలా పైకి పైకి వెళ్ళిపోయి అన్నీ చూస్తా. తరవాత చివరికి అమ్మదగ్గిరికి వస్తా. అమ్మ లడ్డూలూ, మామిడిపళ్ళూ వొద్దే పెడుతుంది."

— ఈవిధంగా మల్లిబాబు తనలో తాను మాట్లాడుకుంటూ ఉంటాడు. తన ఆట వస్తువులతో మాట్లాడుతూ వుంటాడు.

స్నేహితులుగాని, ఎవరైనా పెద్దలుగాని మా యింటికి వస్తే మల్లిబాబుకి మహదానందం. వారితో పరిచయం అతనికి ఒక గొప్ప వేడుక. సరదా. వారి రాక గమనించి, వెంటనే మంచి లాగూ చొక్కా తొడుగుకొని కాస్త అందంగా ఆడంబరంగా కనబడడానికి యత్నిస్తాడు. అల్లరి చేస్తున్నవాడు అటె మానతాడు. మర్యాదస్తుడనే మంచి మార్కులకై ప్రయత్నిస్తాడు. "ఏంబాబూ! నీపేరేమిటి? పాటలు ఏమైనా వచ్చా? నాట్యం నేర్చుకున్నావా?" అని ప్రశ్నిస్తే, దొంగ చూపులు చూస్తూ దోబూచులాడుతూ— పొంగి పొంగి పోతాడు మాబాబు. ఒకటి రెండు సార్లు పరిచయమైతే ఆ పెద్దలముందు పాటలకుపక్రమిస్తాడు మల్లి. అంతులేని పాటలవి. అంతాలంటూ ఎరగని పాటలవి. ప్రారంభమంటూ వుంటుందికాని ఆ పాటలకి ముగింపు అంటూ ఎన్నడూ ఉండదు. మల్లిబాబు ఒక పాటనుండి మరొక పాటలోనికి అలా అలా జారుతూ అనంత గానం ఆలపిస్తాడు. "నమో నమో భారత పతాకా! అని ప్రారంభించి, జో జోకన్నా,

ఓ చందమామా!
పల్లెటూరి పిల్లలండి మేము.
మూగకొండ కడుపునొక్క వాగుకన్నె పుట్టెను.
మేలుకొన్న దేషియా,

పంతులూ! పంతులూ— మొదలైన పాటలన్నిటితో ఒక కదంబ గీతం తయారుచేసి, ఆపు అంటూ లేకుండా అదేపనిగా ఆలాపిస్తాడు. మావాడు. కొత్తవారికా పాటతీరు అంతు చిక్కదు. ఏపాటైనా ఒక్కసారి వింటే మా బాబుకి దాని మొదలు, బాణీ అట్టే వచ్చేస్తుంది. ఇంక ఎప్పుడైనా అడగండి ఆ మొదళ్ళన్నీ కలిపి ఒక వరసలో ఆగని వేగంతో పాటగా పాడతాడు.

దుస్తుల మోజు మా బాబుకి ఎక్కువే. రంగుల సర్దాకంటే రక రకాల రూపాల్లో లాగూ చొక్కాలుండాలంటాడు. అమెరికా జాకెట్, బుష్‌కోటు, లాల్చీ, షరవా, పొట్టిలాగు, పొడవులాగు ఇలా రకరకాల దుస్తులు కావాలంటాడు. లాగూ చొక్కా ఎప్పటికప్పుడు మార్చాలంటాడు. స్నానం చేసినప్పుడల్లా "మంచి లాగూ మంచి చొక్కా" కావాలంటూ పట్టు పడతాడు. ప్రయాణాలు చేసే సమయాల్లో కొంచెం దర్జాకి "పొడుగు లాగు పొడుగు చొక్కా" ఉండి తీరవలసిందే.

రిక్షా, కారు, రైలు ఎక్కడం, ఎంచక్కా ఊళ్ళు తిరగడం, కొత్త పిల్లలతో నేస్తం కలపడం. మురిసిపోతూ వాళ్ళతో "మావూళ్ళోనే బలే రిక్షాలున్నాయి. బస్సు కార్లు కూడా ఉన్నాయి. మరే మా నాన్నగారే బళ్ళోకెళ్ళి నాకు బోలెడన్ని చాకుపీసులు, బొమ్మల పుస్తకాలు తెస్తారు. మరే-మరే—" అంటూ ఊరుకుంటూ ఊరిస్తాడు.

ప్రతి విషయంలో ప్రతి క్షణం క్రొత్త కనబడాలి మా మల్లికి. మాటలు చెప్పినా, పాటలు నేర్పినా, కథలు చెప్పినా, గమ్మత్తులు చేసి చూపినా మార్పు కనబడక పోతే అది పాతదే: నాకు వద్దు." అంటాడు.

కొత్త సినిమా వచ్చినా, కాలేజీలో నాటకాలు, వినోదాలు, ప్రదర్శించినా, బుర్రకథలు చెప్పినా, భజనలు చేసినా, అక్కడకు తనని తీసుకు వెళ్ళమని పంతం పడతాడు. అలాంటి చోట ఎంతసేపయినా నిద్ర మాని శ్రద్ధగా చూస్తాడు. వింటాడు. తాను చూసింది విన్నది

అంతా తరువాత అనుకరించి చూపుతాడు: వర్ణించి చెపుతాడు.

తాను పెద్దవాడైతే హెడ్ మాష్టరౌతానని, కాలేజీలో ఫష్టు పారం చదువుతానని, ఉద్యోగం చేసి నయా పైసలు పెట్టెనిండా సంపాదిస్తాననీ, ఇంకా కారు నడుపుతానని, మాట్లాడితే రైలు యింజనులో పని చేస్తానని, ఆ మాట కొస్తే విమానమే నడుపుతానని ఊహించుకుంటూ ఉంటాడు.

నిత్యం కల్పనలు. కవిత్వాలు అల్లుతూ వుంటాడు. అర్థం పర్థంలేని మాటలతో అద్భుతంగా పాటలు కూర్చి లయ తప్పకుండా బర బర పాడేస్తాడు. లయజ్ఞానం మాబాబుకి అపారం. అది అతనికి పుట్టుకతోనే వచ్చిన సహజ లక్షణం. బల్లలమీద, పెట్టెలమీద, అట్టలమీద! బుట్టలమీద, యింట్లో కనబడిన ప్రతి వస్తువుమీద తన చిన్న చేతులతో మద్దెలవాయిస్తూ పాడతాడు. "నాన్నా, సినిమా ప్లేటులో ఇలాగే కదూ పాడింది?" అని అడుగుతాడు. "ఔను" అంటే అతి సంతృప్తి చెందుతాడు.

మా బాబు లక్షణాలన్నీ చిన్ననాడు నాలో ఉండేవని నను పెంచిన పెద్దలంటారు. ఎక్కడో యింత చిన్న విషయం ఒకటి విన్నాడంటే, మా బాబు అది ఎప్పుడూ యింక మరిచిపోడు. అది నా లక్షణమే అంటారు. కల్పనా గుణం, గానం, లయ అన్నీ నావే అంటారు. ఈ గుణాలన్నీ మంచివైనా, మరెట్టివైనా మా బాబులో చూచుకోవడమంటే, చెరగని తీరున వాటిని చాచుకోవడమే అవుతుంది కదా! అట్టివి ఏ తండ్రికి ఇష్టం కాక పోతుంది?

మా యింటే కాదు, మీ యింటా వుంటారు, ముద్దు ముచ్చట గొలిపే మా మల్లిబాబు లాంటి బాబులు. మురిసి మురిపించే బాబులు. వారి అల్లరిని అతి ఓపికతో సానుభూతితో సహించి, వారి ఆనందాన్ని అందరము అందుకో గలిగితే, మన జీవితాలన్నీ నందనవనాలౌతాయి. నవ నవోన్మిషిత మౌతాయి.

---



మిస్ ఒలెక్సియక్

రోగులకు అపరేషను ఎంత అవసరమో, ఆపరేషను అయిన తర్వాత మత్తునుంచి తేరుకొనేటంతవరకూ వారిని ప్రత్యేక శ్రద్ధతో చూడటం కూడా అంత అవసరం. అందుచేత వారిని ఆపరేషను అయిన తర్వాత కొంతకాలం వరకూ ప్రత్యేక పరిశీలనకొరకు ఉంచబడే గదులను రికవరీ రూములు అంటారు. ఈ రూమును తొలిసారిగా భారతదేశంలో ఒక అమెరికన్ నర్స్ స్థాపించింది, రికవరీ రూము నర్సింగ్‌లో ఆమె కొందారు నర్సులకు ప్రత్యేక శిక్షణను కూడా ఇచ్చింది. ఆమె పేరు మిస్ ఫిలిస్ డి. ఒలెక్ సియక్. క్రిందటి సంవత్సరం. మార్చి నెలలో అమెరికన్ సాంకేతిక సహకార కార్యక్రమంక్రింద, అమెరికానుంచి ఆ నర్సు ఇండియాకు వచ్చింది. ఇక్కడ ఆమె కృషి ఫలించింది. సంతృప్తహృదయంతో ఆమె జూన్ 30 వ తేదీని అమెరికా తిరిగి వెళ్ళుతున్నది,

ఆమె సఫ్దర్ జంగ్ ఆసుపత్రిలో పని చేసిన ఈ 15 నెలలలోను అక్కడ ఒక రికవరీ రూము స్థాపించటమే గాక, ఆ ప్రత్యేక రంగంలో భారతీయ నర్సులకు శిక్షణనిచ్చింది. "నేను శిక్షణ నిచ్చిన భారతీయ నర్సులు నాకంటే బాగా పని చేస్తున్నారు" అని సంతోషపూర్వకంగా ఆమె అన్నది.

"ప్రతి పెద్ద ఆసుపత్రిలోనూ రికవరీ రూములు తప్పకుండా ఉండాలి. అపరేషను జరిగిన రోగులు మత్తునుంచి తెప్పరిలుకొనే సమయంలో ఈ ప్రత్యేక గదుల అవసరం ఎంతైనా ఉంది. ఆ రోగులను శ్రద్ధగా చూడటంలో ప్రత్యేక శిక్షణ పొందిన నర్సులు, దానికి అవసరమైన పరికరాలు ఒక చోట ఉంటే ఆపరేషన్ అనంతరం మరణించే వారి సంఖ్య తగగలదు.... తగు తుంది." అని అన్నదా అమెరికన్ నర్స్.



అమాయకురాలు, అధిక బంధుప్రియ, అయిన కుమారి బుల్లి సీత తన పద్దెనిమిదవ యేటనే, తన తలిదండ్రులను దుఃఖ సాగరంలో ముంచి, 30 5-58 తేదీని దివంగతురాలైనదని తెలుపుటకు మేమెంతయు చింతిస్తున్నాము, ఈమె దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి యేకైక పుత్రిక. చిన్నతనము నుండియు చిత్ర లేఖనము నందు యీమెకు అధికమైన ప్రీతి. ఇటీవలనే ఆంధ్ర మహిళ యీమె రచించిన చిత్రమునకు పారి తోషికము కూడ నొసంగినది. ఈమె అకాల మృతికి మా సంతాపమును వారి తలిదండ్రులకు, బంధు మిత్రులకు తెలియజేస్తున్నాము.

—సంపాదకురాలు.

# బాలవితంతువు

మూలం :
శ్రీ రవీంద్రనాథ టాగూర్

అనువాదం :
శ్రీ కడియాల అమరసుందర్

మాఇంటి పక్క ఇంట్లో నివశించే బాల వితంతువు మీద నాకు భక్తి ప్రపూరితమైన సద్భావం సదా ఉండేది. అలా అని నేను నా మిత్రులకు చాలా సార్లు చెప్పాను. నాకు నేను కూడా అలాగే అనుకున్నాను. నాకు అత్యంత సన్నిహితుడైన నవీన్‌కూడా నా మనస్థితిని ఎర గడు. నా హృదయంలో అట్టడుగున గుప్తంగా దాచుకున్న భావాలను చూసుకొని గర్వించే వాడిని. ఆమె. అకాలసమయంలో భూమిమీద పడ్డ సేఫాలీ పుష్పంలాఉంది. కాని ఆమె స్వర్గానికి నిర్దేశింప బడిఉంది.

మనోభావం పర్వత ప్రవాహం లాంటింది. అది పుట్టినచోట ఉండమంటే ఉండదు. కట్టలు తెంచుకు ప్రవహిస్తుంది. నా భావాలను గేయాలలో పొందు పరచడానికి ప్రయత్నించేవాడిని. కానినాకలం భక్తి ప్రపూరితమైన సద్భావాన్ని భ్రష్టం చెయ్యడానికి మాత్రం మొరాయించేది.

ఇదే సమయంలో నా మిత్రుడు నవీన్ గేయాల పిచ్చిలో పడి కొట్టుకుంటున్నాడు. అతనికి గేయాలు రాయడం అదే ప్రథమం. యతి ప్రాసలు తెలియవు. అయినప్పటికీ అతడురాయడం విరమించలేదు.

చివరకు నా సహాయాన్ని అర్థించాడు. అతని గేయ ఇతివృత్తం బహు పురాతనమైనది. అతని గేయాలన్నీ ప్రేయసిని సంబోధిస్తున్నాయి. అతని వీపుమీద నెమ్మదిగా చరిచి అడిగాను. "అయితే ఆవిడెవరు!"

"నేనింకా చూల్లేదు" అన్నాడు నవీన్ నవ్వుతూ.

అతని గేయాలను సరి చూడడానికి నేను చాల శ్రమ తీసుకోవలసి వచ్చింది. ఇంచుమించు ప్రతిగేయాన్ని నేను తిరిగి వ్రాయవలసి వచ్చింది చివరి కవి నా గేయాల్లో తయారై కూర్చు న్నాయి.

నవీన్ ఆశ్చర్యంతో అన్నాడు. "నేను చెప్ప దలుచుకున్న భావాలు అవే. కాని చెప్పలేక పోయాను ఈ ఉదాత్తమైన భావాల నన్నీ నువ్వెలా పొందుపర్చ గలిగావు!"

"అవి నా ఊహాలోకం లోంచి వస్తాయి" కవిలా సమాధానం చెప్పాను.

నవీన్ "అవును నిజమే!"అని తల ఊపాడు.

ప్రేమ మీద నాకున్న భావాలను కాగితం మీద రూపొందించడం అదేప్రథమం. నవీన్‌ను ఒక తెరగా అడ్డుపెట్టుకొని నా భావాల నన్నీ ఈ గేయాలలో మూస పోశాను.

చివరకు నవీన్‌అన్నాడు. ఈ గేయాలు నీవి. వాటిని నీపేరు మీదుగానే ప్రచురింప చేద్దాం!

వెర్రివాడా! అవి నీవేనోయ్. నేను అక్కడక్కడ ఒకటి రెండు మాటలు చేర్చానంతే!" అన్నాను

నవీన్ మారు మాటాడలేదు.

నా దృష్టిని అప్పుడప్పుడు మా ఇంటి పక్క కిటికీవైపుకు సారించేవాడిని నా చూపులు ఎవరి కోసమో కలయచూసేవి. ఊహాలోకంలో ఒక తేజోవంతమైన కాంతి నా దృష్టిపథంలో మెరసి నా భావాలను క్షాళనం చేసేది.

ఓ రోజున నేను ఆశ్చర్య పోయాను. నా కళ్ళను నేనే నమ్మలేక పోయాను. అది ఒక వేసవినాటి సాయంకాలం. వడగాలి ఇంకా తీవ్రంగా వీస్తోంది. ఆకాశంలో నల్లటి మేఘాలు గుమి గూడు కుంటున్నాయి. అస్తమిస్తున్న సూర్య కిరణాలు వింత కాంతుల్ని వెదజల్లుతు న్నాయి. ఆ సుందర ప్రకృతి రామణీయకతను తిలకిస్తూ మా ఇంటిపక్క బాలవితంతువు ఆకా శంలోకి నిర్నిమేషంగా చూస్తోంది. చిరకాలం నుంచి నిరీక్షిస్తున్న నేను ఆమెవిశాలమైన నల్లటి సుందరమైన నయనాలను సుదూరంనుంచి వీక్షించ గలిగాను. కడలేని ఆ వీక్షణ స్వర్గ ద్వారాలనైవు నిర్దేశింప బడలేదు. మబ్బుల్లో వేగంగా ఎగిరి పోతున్న పక్షిలా నా మనో భావాలు పరుగిడుతున్నాయి. ఒక మానవ హృదయ స్పందన టపటపలు నాకు టక టకా వినవొస్తున్నాయి.

వర్ణించలేని ఆంధ్రమహిళను వీక్షించిన పిదప నా హృదయం సంతృప్తితో నిండి పోయింది. కేవలం ప్రయోజన రహిత గేయాలను సరిదిద్ద డంలోనే నేను సంతృప్తి పొందలేదు. నిర్మాణా త్మకమైన ఒక ప్రయోజనకరమైన పంథాను చే పట్టాలనినిర్ణయానికి వచ్చాను. దేశంలోవితంతు వివాహాలను ప్రోత్సహించడానికి నడుంకట్టాను. కేవలం ఈ సమస్యమీద కబుర్లుచెప్పి, రాతలు రాయడమేకాకుండా దానికోసం కొంతధనాన్ని కూడా వెచ్చించడానికి సిద్ధ పడ్డాను.

నవీన్ నాతోవాదనలోకి దిగేవాడు. శాశ్విత వైధవ్యంలో పవిత్రత, సుందరత, ఏకాగ్రత నిభీడీకృతమై ఉన్నాయి. పునర్వివాహం ఆ సుం దరతను అపవిత్రం చెయ్యదూ?'' అన్నాడు.

ఈరకమైన దృక్పథం నాకు సర్వదాక్రోషాన్ని కలిగిస్తుంది. కరువు కాలంలో సుష్టుగా భోంచే సిన ధనికుడు, ఆకలితో అలమటిస్తూ చావటా నికి సిద్ధంగా ఉన్న మనిషికి పువ్వుల వాసన చూపి, పక్షుల పాటలు వినిపించి ఆకలి తీర్చు కోమంటే అదెట్లా ఉంటుంది? అటువంటివాళ్ళను గురించి మనమేం అనుకోవాలి? నేను కొంచెం కోపంతో అన్నాను. "ఇలా చూడు నవీన్! ఒక శిథిల గృహం చిత్రకారుడికి అందంగాతోచ వచ్చు. కాని ఇళ్ళు చిత్రకారుల ఆనందం కోసం కట్టరు. అందులో ఉండటానికి కట్టుకుంటారు. చిత్రకారులకు వ్యథ కలిగినా వారు ఇళ్ళు మర మ్మత్తు చేయించు కుంటారు. సుదూర కోణం లోంచి పరికించి వైధవ్యాన్ని సుందరతా భావా లతో సమ్మిళితం చేసే ముందు ఒక విషయం ఆలోచించు. వైధవ్యంలో ఒక మానవ హృద యం వ్యథతో, కాంక్షతో స్పందన చేస్తుందని మాత్రం గుర్తుంచుకో!''

నవీన్‌తో వాదించడంలాభం లేదనుకున్నాను. కాని నా చిన్న ప్రసంగం పూర్తయ్యేసరికి ఒక్కసారి సాలోచనగా నిట్టూర్చి, నాతో పూర్తిగా ఏకీభవించాడు. ఇంక నేను వాదించ వలసిన అవసరం లేకపోయింది.

మరి కొన్ని రోజులు గడిచాక నవీన్ నా దగ్గరకు వచ్చాడు. నేనేమైనా సహాయం చేస్తే తను ఒక వితంతువును వివాహం చేసుకోవడానికి సిద్ధంగా ఉన్నట్లు చెప్పాడు.

నా సంతోషానికి మేరలేదు. నేనతన్ని గాఢంగా కౌగలించుకున్నాను. అందుకోసం కావలసిన డబ్బంతా సర్దుతానని చెప్పాను, ఇకప్పుడు నవీన్ తన కథ చెప్పుకొచ్చాడు.

నవీన్‌ప్రేయసి ఊహా లోకంలో మాత్రం లేదని నేను తెలుసుకున్నాను. నవీన్ చాల రోజులనుంచి కిటికీ దగ్గర నిలబడి ఉండి ఓ వితంతువును చూడసాగాడు. కాని అతని భావాలను ఎవరితోనూ చెప్పలేదు. నా గేయాలు, నవీన్ గేయాలు ప్రచురితమయ్యే పత్రికలు ఆమె చేతికి అందేవి. ఆ గేయాలు తమ ప్రభావాన్ని ఆమెమీద ప్రసరింపజేశాయి.

నవీన్ బహు జాగ్రత్తగా తన ప్రేమను వ్యక్తీకరింప జేశాడు. ఆమె పత్రికలు చదువు తుందని మొదట్లో అనుకోలేదని నవీన్ నాతో అన్నాడు. ఆమె సోదరుని పేరుతో తన చిరు నామా లేకుండా పత్రికలను పోస్టుచేసేవాడు నవీన్. ఇలా చెయ్యడంలో ఆత్మసంతృప్తి తప్ప అతనికేమీ ప్రత్యేకమైన అభిప్రాయంలేదు. క్రమంగా ఆమె సోదరునితో పరిచయానికి ఏర్పరుచుకున్నాడు. ప్రేయసికి ఆప్తులైన వారితో పరిచయం చేసుకోవడానికి ప్రియులెప్పుడూ తహ తహ లాడుతారు.

తరువాత కొంత కాలానికి ఆమె సోదరుడికి జబ్బు చేసింది. ఆ సందర్భంలో వారిద్దరికీ సాన్ని హిత్యం ఏర్పడింది.-వారతని గేయాల గురించి చర్చించుకునే వారు.

వితంతువును ఆ మధ్య వాదంలో నాతో ఓడిపోయిం తరువాత నవీన్ వివాహం చేసుకో వాలనే నిశ్చయానికి వచ్చి, తిరిగి ఉత్సాహాన్ని నింపుకున్నాడు. మొదట్లో అందుకామె ఒప్పుకో లేదు. నా వాదంలోని మాటల్ని, అవసరమైతే ఒకటి రెండు అశ్రువుల్ని ఉపయోగించి ఆమెను చివరకు అంగీకరింప జేశాడు. అందుకోసం ఇప్పుడు కొంత డబ్బు కావలసి వచ్చింది.

"డబ్బు ఇప్పుడే తీసుకెళ్ళు" అన్నాను.

కాని నవీన్ చెప్పుకు పోతున్నాడు. "నీకు తెలుసు కదా ఉద్యోగం సద్యోగం లేకుండా మరి మేము జీవించేదెలా?"

నేను మాట్లాడకుండా చెక్కు రాసి అతని చేతికిచ్చాను. "ఇంతకీ ఆమె ఎవరు? నన్నో శతృ వుగా జమకట్టకు. ఆమెకు నేనేమీ గేయాలు రాయనులే. ఒకవేళ రాసినా ఆమె సోదరుడికి పంపించను ; నీకే పంపిస్తాను" అన్నాడు.

"నీ శతృత్వాన్ని వెరచికాదు ఇంత వరకూ ఆమె పేరును బయట పెట్టింది.అసలు జరిగిందేమి టంటే ఆమె ఈ విషయాన్ని ఎవరితోనూ చెప్పవద్దని అభ్యర్థించింది. ఇప్పుడంతా సవ్యంగా పరిష్కారమై పోయింది. ఆమె మీ ఇంటి పక్కన పంతొమ్మిదో నెంబరు ఇంట్లో ఉంటుంది" అన్నాడు.

నా హృదయం ఇనప పెనం అయినట్లయితే పగిలిపోయి ఉండేది. "పునర్వివాహానికి ఆమెకు అభ్యంతరం లేదూ!" అని అడిగాను.

"ఇప్పుడేం లేదు" నవ్వుతూ చెప్పాడు నవీన్

"అయితే గేయాలే ఈ వింత మార్పును తీసుకొచ్చా యన్నమాట"

"నా గేయాలు అంత చెడ్డవేమీ కావు. అవునా?" అడిగాడు నవీన్.

కనీసం నా జీవితంలో మొట్టమొదటి సారిగా వితంతు వివాహాన్ని, కళ్ళారాచూడ గలుగు తున్నాననే సంతృప్తి నామెదడులో మెరిసింది.

---

# కలికాలపు పెండ్లికొడుకు

కూర్పు: పరుచూరి సత్యనారాయణ ఏమ్. ఎ.

ఎవరాతడు ? ఎవరాతడు ?
తలపాగతో పాలకిలో
ఠీవిమీఱ నున్నాడు
ఎవరాతడు ? ఎవరాతడు ?

మునుముందుగ బాజాలు
వెనుకంజన బందుగులు
లిరుపక్కల దివటీలు
కదలిరాగ పాలకిలో
కొలువుదీరి వున్నాడు
॥ ఎవరాతడు ॥

ఎవరెవరిం కెవరెవరు ?
ముదిబారిన ఎవరీయన ?
ఈవూరికి తరలివచ్చె
ఎవరింటికి పెండ్లికొడుకు ?
॥ ఎవరాతడు ॥

ఓ యల్లమ్మా ! పుల్లమ్మా !
ఎఱుకజెప్పరో యమ్మా !
ఎవరీయన ? ఎవరీయన ?
ఎవరింటికి పెండ్లికొడుకు ?
॥ ఎవరాతడు ॥

సుబ్బమ్మా ! వినవమ్మా
వీథిచివరి ఇంటాయన
కొనితెచ్చిన గొడ్డీయన
ఈ ముదిగొడ్డుకు పదివేలట
॥ ఎవరాతడు ॥

కాలికి బలపంకట్టి
ఊరూరా గాలించి
కొనితెచ్చెను కొసరికొసరి
వేసారిన పాపతండ్రి
॥ ఎవరాతడు ॥

చెపితే తీరదు ఈతడి
విడ్డూరపు విరగబాటు
గుబ్బమెంత గుడ్డిదయిన
దానాకు తెఱుగుండునె
॥ఎవరాతడు ॥

పొలమసలే గల్లంతు
ఇల్లితనికి లేదూళ్ళో
వల్లకాటి తల్లిదండ్రు
లున్నారెప్పుడో చచ్చి
॥ ఎవరాతడు ॥

అబ్బురమే సుబ్బమ్మా
అబ్బడి చదివిన చదువు
రెండు రెండు ఎంతంటే
మూడని చెప్పే మోడు
॥ ఎవరాతడు ॥

అబ్బబ్బో అందమేమె !
వీపున తట్టెడు నడ్డి
చీమ కళ్ళు పట్టిముక్కు
దొప్ప చెవులు దోనెకడుపు
॥ ఎవరాతడు ॥

బంగరు బొమ్మాపాప
మునుపే నోములనోచెనో
బ్రహ్మరాత ఫలమేమో
కుదిరెగదే కొండముచ్చు
॥ ఎవరాతడు ॥

ఆడపిల్ల తల్లిదండ్రు
లల్లాడే కలికాలం !
అమ్మలగను అమ్మలార
కన్నుదెఱచి చూడండి
॥ ఎవరాతడు ॥

---



# నేరజాణల వ్యాపారాలు - వృత్తులు

శ్రీమతి కె. లక్ష్మి రఘురామ్.

దేశ చట్టము ప్రకారము స్త్రీలు ఏ వృత్తులకు అనర్హులు కారు. పురుషులతోపాటు ఏ వ్యాపారము గాని, ఏ వృత్తిగాని నిర్వహింప వచ్చును. జీవనోపాధికి ఏ వ్యాపారము, ఏ వృత్తి ప్రజలు అవలంబించినా అది జన్మ హక్కే (ఫండమెంటల్ రైట్స్). దేశములో ఒక్క వృత్తిలో మాత్రము స్త్రీ పురుషుల తారతమ్యము లేకుండా ఒక వృత్తిని సాగిస్తున్నారు. ప్రభుత్వము దీనిని యిమ్మొరల్ ట్రాఫిక్ యాక్టుతో నిర్మూలము చేయదలచింది. అందుకనే ఈ వృత్తి వ్యాపారము సాగిస్తున్న స్త్రీలు పార్లమెంటు భవనములముందు సమ్మెచేశారు. వారి జీవనోపాధి నిర్మూలిస్తే ప్రభుత్వము వేరే దారి చూపించవద్దూ ?

చట్టములతో ఈ వ్యభిచార మహమ్మారిని ప్రభుత్వము నిర్మూలించాలను కోటము వట్టి భ్రమ. ఈ చట్టమువల్లగాని, వ్యభిచరించుచున్న స్త్రీ పురుషులను శిక్షించుటవల్లగాని ఈ వ్యభిచార మహారోగాన్ని వదలించలేరు. చట్టములతో మద్య నిషేదము ప్రభుత్వము కొనసాగించ గలిగిందా ? అట్లాగే చట్టములతో వ్యభిచారము నిర్మూలించుటా అసంభవము.

వ్యభిచార వ్యాపారాన్ని కొందరు స్త్రీలు ఎందుకు సాగిస్తున్నారు ? వారందరూ పొట్టకూటికే సాగిస్తున్నామని వారే ఏకగ్రీవంగా చెప్పుతున్నారు. వారితో వ్యభిచరించుచున్న పురుషులెందుకు వ్యభిచరించుచున్నారు ? దానిలో వారికి వచ్చే లాభముగాని ఆనందముగాని, సౌఖ్యముగాని లేదు. అయినా వారు వ్యభిచరించుచున్నారు. కారణము మతి మాలి అవనీతి పరులగుటే. ఎప్పుడు వ్యభిచార వ్యాపారము సాగించే స్త్రీలుండరో అప్పుడే వ్యభిచరించే పురుషులూ వుండరు.

స్త్రీలు వ్యభిచరించటము పొట్టకూటికను నది నిర్వివాంశము. కొందరు స్త్రీలు బహిరంగముగా మహాపట్టణాలలో అక్కడి సందుల్లో, ఇక్కడి గొందుల్లో ఈ వ్యభిచారాన్ని వ్యాపారముగా సాగిస్తున్నారు. ఆ స్థలాలనే డేంజరు జోను, ఎర్ర దీపపు జోను అనే నామధేయములతో వ్యవహరింపబడుచున్నవి. ఈ ప్రదేశాలలో తిరిగే పురుషులు వెతుక్కుంటూ పాపానికి బయలుదేరుచున్నారు. ఇక్కడి వేశ్యలు ఆ విటుల సర్వస్వము హరించి బుద్ధి చెప్పుచున్నారు. వీరినే ప్రభుత్వము చట్టము

లతో నిర్మూలింపనెంచినది. కాని వారు వారి రహస్య నీచ వ్యాపారాన్ని నిరభ్యంతరముగా సాగించ గలరు. నిజంగా ప్రభుత్వము వ్యభిచారము నిర్మూలించ దలచితే ఈ స్త్రీలకు వేరే దారి చూపించాలి. వారికి మర్యాదగా సులభంగా జీవనము సాగించుటకు ఉపాధి కలిగించాలి.

కాని ఇట్టి వ్యాపారము బహిరంగముగా సాగిస్తున్న స్త్రీలకన్నా ఇంకో రకము నీతిమాలిన స్త్రీలు నిరాఘాటంగా వ్యభిచారము సాగిస్తున్నారు. వారుకులటలైనా కులాంగనలవలే తిరుగుచున్నారు. పయోముఖవిషకుంభములవలే గృహస్థుల ఇండ్లలో తిరుగుతూ అనేక కాపరములకు చిచ్చు పెట్టు చున్నారు. తళుకు బెళుకు వేషములతో అనేక పురుషులను మోసగించి వారి ధనమును అపహరించు చున్నారు. వారు ఇక్కడ అక్కడ, వీరు వారు, అనే వివక్షత లేకుండా, ట్రావలర్సు బంగళాలలోను, బడి ప్రహారములలోను, స్కూళ్ళలోను, కాలేజీలలోను ఆఫీసులలోను, సంఘసేవా సంస్థలలోను, రాజకీయ వేత్తల ఇండ్లలోను, మతసంస్కర్తల గృహాల్లోను ఎంతో చాతుర్యముతో వారి వ్యాపారాన్ని సాగిస్తూ, వారి పొట్ట పోషణకొరకు ఎంతో ధనాన్ని సంపాదిస్తూ వున్నారు. ఈ జాతి కులటలకు పొట్ట పోషణతో తృప్తి వుండదు. వీరు సంఘములో ఒక విచిత్ర స్థానము నలంకరించుటకు ప్రయత్నిస్తారు: ఇల్లు, వేషము, అట్టహాసము ధననంతులవలే వుండవలయును. సంఘములో ఏదో ముఖ్యస్థానమో, కార్యమో సాధించుచున్నట్లు అగపడవలెను. దానికై వారు ఎన్నో అసత్యములు' అధర్మములు అవినీతి కార్యములు చేయుదురు. ఒక్కొక్కొప్పుడు రంకుతనముతోపాటు దొంగతనము చేయవలసియుండును. సాగినన్నాళ్ళు ఇట్టి వ్యాపారము సాగించి వీరు సహజముగా తరువాత ఏ దురవస్థోపాలగుదురు. వీరునే మొదట జెప్పిన పడుపు వృత్తి సాగిస్తున్న స్త్రీల కన్నా సంఘానికి చాలఅపకారము చేయుచున్నారు. మొదటి రకమువారు వారి విటులకే హాని కలుగిస్తున్నారు. రెండవ రకము వారు సంఘానికి అపారమైన హాని కలిగిస్తున్నారు. ఇంకొక రకము ఆ కుటుంబానికే హాని చేసేవారూ వున్నారు. ఈ రకము స్త్రీలు కేవలము ఆర్థికముగా నిస్సహాయులై, ధైర్యముగా ధర్మముగా ధనార్జనచేయలేక, ధనార్జన చేయవలసిన అగత్యము ఏ కారణము వల్లనో వారి పాలిటబడుటచే ఇట్టి అవినీతికి వడిగట్టి ధనార్జన చేయుటకు పాల్పడిననారునూగలరు. ఈ మూడు జాతుల స్త్రీలలోను రెండవ జాతివారు సంఘానికి అపారమైన అనర్థము కలిగించుచున్నారు.

వీరి వేషభాషలను బట్టి వీరు వ్యభిచారిణులని నిర్ణయించుట కష్టము. వీరు ఎర ఎక్కడ ఎప్పుడు వేయుచున్నారో తెలియదు. వీరు జార్జటు, షిఫాను చీరులు దప్పకట్టరు. ఏడువారాల నగలు ధరిస్తారు. ఒక స్థానములోనే వుండరు. హడావిడిగా కార్లలో విమానములో దప్ప ప్రయాణము చేయరు. పంచభక్ష్య పరమాన్నములు దప్ప భుజించమని, హంస తూలికా తల్పములదప్ప నిదురించమని చెప్పుకుంటారు. వారు చెప్పేది ఒకటి. చేసేది ఇంకొకటి. ఆలోచించేది మరియొకటి. అది ధనార్జన. ఆ ధనార్జన కొరకు ఎట్టి అవసర కార్యముగాని, దుర్మార్గముగాని చేయ సాహసింతురు, వారు చేయలేనిది చేయరానిది అంటూ ఒకటి వుండదు. కాబట్టి వీరు తమ విటులకు చేసే హానే కాకుండా అనేక మందికి హాని కలిగిస్తారు. అమాయకుల నెందరినో వంచించుతారు. అపవాదులతో బాధిస్తారు. ఎందరి గౌరవ మర్యాదలనో హరించి, వారి ధనమును అపహరించ చూస్తారు. అనేక సంస్థలకు, పెద్ద మనుష్యులకు అపారమైన హాని చేస్తారు. దేశ గౌరవ మర్యాదలు రూపుమాపుతారు. వీరిని సంస్కరించేదెట్లా? అదే స్త్రీలకు సవాలు.

వారికి ఏదో కొద్ది జీవనోపాదితో తృప్తివుండదు. సాధారణముగా వీరు విద్యావిహీనులు, అవివేకులై వుంటారు. వీరికి విద్యాగంధము అతకదు. అప్పుడు వీరికి ఏదైనా వృత్తి విద్య నేర్పించుట అవసరము. ఈ వృత్తివల్ల ఆర్జించే ధనము తమ ఇంద్ర భోగమునకు సరిపోయేటట్లుగా వుండాలి. లేకపోతే వారు వారి నీచపడుపు వృత్తిని వదలుట కష్టమే.

మన దేశములో అట్టి ఇంద్ర భోగము అనుభవించుటకు వలయు వృత్తులేవి లేవు. అట్టి భోగము అనుభవించుటకు పదిమంది విటులను చేరక తప్పదు. కావున వారికి నేర్పవలసినది నైతిక ధర్మములే. నైతికముగా వారు సంస్కారము పొందితే తప్ప వారికి వేరే దారిలేదు.

మొన్న మా సోదరి శ్రీమతి రా.........స్త్రీ పత్రికలలో ఒక కథ వ్రాస్తూ దేశములో పతివ్రతలున్నారా అని అడిగింది. లేకేమి అని చెప్పింది కూడాను. లేకేమి ముమ్మాటికి వున్నారని మేము సాహసించి చెప్పుచున్నాము. కులట లెంతమంది వున్నారో పతివ్రతలూ అంత మంది వున్నారు. వారుండబట్టే యింకా సూర్య చంద్రాదులు ప్రకాసిస్తున్నారు. అంతేకాదు. వారితోపాటు ఏక పత్నీవ్రతులైన శ్రీ రామచంద్రులు, ధర్మరాజులు, హరిచంద్రులు, బలిచక్రవర్తులు అనేకమంది వున్నారు. చీకటుంటేనే వెలుతురు కనబడుతుంది. పాపముంటేనే పుణ్యము కనబడుతుంది. పుణ్యాత్ములుంటేనే దుర్మార్గులు కనబడుతున్నారు.

కాని, ఈ రోజుల్లో అన్నము, పానీయము, నిద్రవలెనే సంభోగముకూడా ఒక సహజమైన కర్మ అనే వాదించే విపరీత వాదులు బయలుదేరినారు. ఈ వాదము దుర్గతికే మూలము. అది కేవలము సంతానానికేనని ఎప్పుడు మన సోదరీమణులు గ్రహిస్తారో ఆనాడు వ్యభిచారము దానంతటదే మటు మాయమగును. ప్రభుత్వము చేయలేనిది స్త్రీలు సాధించగలుగుతారు.

శ్లో॥ నసంసారోత్పన్నం చరిత మనుపశ్యామి కుశలం
విపాకః పుణ్యానాం జనయతి భయంమే విమృశతః
మహద్భిః పుణ్యౌఘైశ్చిరపరిగృహీతాహి విషయాః
మహాన్తో జాయన్తే వ్యసనమినదాతుం విషయణామ్ ॥

ఈ సత్యము స్త్రీలు గ్రహిస్తే వ్యభిచారము అంతరించటమే కాకుండా, సంతాన నిరోధ కేంద్రాల అవసరము లేకుండా చేయగలరు.

వివేకులై దేశాన్ని రక్షించుకొనుట ప్రజల విధి. మానాన్ని రక్షించుకొంటూ దేశాన్ని రక్షించుకొనుట స్త్రీల విధి.



## గౌతమీ విద్యా పీఠము,
## రాజమహేంద్ర వరము

ఈ విద్యా పీఠముచే నడుపబడు కాలేజి, మిడిల్ స్కూలు, ప్రాచీన పద్ధతి పాఠశాల విమర్శశాఖ, మాన పత్రిక మున్నగు నాయా సంస్థలకు ఉపాధ్యాయులున్ను, విద్వాంసులున్ను, గుమాస్తాలున్ను. లైబ్రేరియన్ మొదలైన వారున్ను అపాయింటుమెంటు చేయుటకు కావలసియున్నారు. కావున విద్యా పీఠనిబంధనలకు లోబడి పని చేయదలచినవారు తమ యోగ్యతలను, సర్టిఫికేట్లను: ఇతర వివరములను తెలియజేయుచు దరఖాస్తులను వెంటనే సెక్రెటరీగారికి పంపించుకొనవలయును. గవర్నమెంటు స్కేల్సుప్రకారము జీతము.

—: అభ్యర్థులకు కావలసిన యర్హతలు: —

1. విద్యాప్రవీణ- భాషాప్రవీణ (1, 2 క్లాసులలో నుత్తీర్ణులైనవారు మాత్రము)
2. తర్క-సాహిత్యాలంకార పాఠములు చెప్పెడి యనుభవము గల ఓరియంటల్ కలాశాలో పాధ్యాయులు.
3. క్రమాంతము వేదాధ్యయనముచేసి సాహిత్యము మొదలైన విశేషములుకలవారు.
4. సెకెండరీగ్రేడ్ ట్రయినింగు టీచరు.
5. ఫిజికల్ ట్రయినింగు ఇన్‌స్ట్రక్టరు.
6. గుమాస్తాలు

N. B:- హెచ్చుకాలము అనుభవము, సర్వీసుకలవారు రిటైర్డు అయినను సరే దరఖాస్తులు పెట్టుకొనవచ్చును.



★

❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖

### ఆంధ్ర మహిళా సభ —

ఆవరణలో ప్రతీ రోజూ బీద- బాల బాలికలకు జరుగుచున్న పాల పంపకం-

మే నెలలో- 5802

ఈ పాల పంపకం ప్రతీ రోజు ఉదయం 7 గంటలకు జరుగుచున్నది.

శని, ఆదివారములు నూకల గంజి కూడా పోయుట జరుగుచున్నది.

ఆం. మ. స.

❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖❖

# ANDHRA MAHILA SABHA

## NURSING HOME & NURSES' TRAINING CENTRE

### Statistics for the month of June '58.

**OUT-PATIENT REGISTER**

| | June |
|---|---|
| No. of Surgical cases treated | 80 |
| ,, ,, Medical ,, ,, | 1067 |
| ,, ,, Ante-natal ,, ,, | 306 |
| ,, ,, Post-natal ,, ,, | 109 |
| ,, ,, E.E.N.T. ,, ,, | 62 |
| ,, ,, Gyneac ,, ,, | 173 |
| Total No. of New patients | 1802 |
| ,, ,, ,, Old patients | 2667 |
| Grand total | 4469 |

**ADMISSION REGISTER**

| | |
|---|---|
| No. of Patients admitted for deliveries | 207 |
| ,, ,, Medical cases treated | 82 |
| ,, ,, Post-Natal ,, ,, | 5 |
| ,, ,, Gyneac ,, ,, | 34 |
| ,, ,, Surgical ,, ,, | 1 |
| ,, ,, Lodgers | 160 |
| Grand total | 489 |

**IN-PATIENT MATERNITY REGISTER**

| | | |
|---|---|---|
| No. of Normal deliveries | | 149 |
| ,, ,, Abnormal deliveries | Forceps 16<br>Version 1 | 17 |
| Grand Total | | 166 |

REPORT FOR THE MONTH OF JUNE '58

V Batch of Auxiliary Nurses (30 in number) have completed their syllabus in Nursing and Midwifery. They have finished conducting 25 cases in the Institute and 5 cases each in the patient's houses. They are at present awaiting their Final examination and are having revision classes in midwifery.

VI Batch - Senior (15 in number) have finished their six months of training in Elementary Nursing in the General Hospital. They will be appearing for their First Examination in July.

VI Batch - Junior (15 in number) have completed their 3 months of Preliminary training and have reported for six months training at the General Hospital from 1st June '58.

**Mrs. V. LAKSHMI PARVATHI**
*Secretary and Convenor*

**Dr. M. PAVANA BAI**
*Medical Superintendant*

# ఆంధ్ర మహిళా సభ

## మైలాపూర్ - మద్రాసు

| | |
|---|---|
| మహిళా విద్యాలయము | : హిందూ కాశీ విశ్వవిద్యాలయము అడ్మిషన్, ఇంటర్మీడియట్, ఆంధ్ర మెట్రిక్, ఎస్.ఎస్.ఎల్.సి., పరీక్షలకు శిక్షణ. |
| పారిశ్రామిక విద్యాలయము | : కుట్టు, ఎంబ్రాయిడరీ ఊలు అల్లికలు, నూలు వడుకుట, చేనేత, అచ్చుకూర్పు, ముద్రణ, బైండింగ్ ఇత్యాది పరిశ్రమలలో గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ, బీద విద్యార్థినులకు ఉచితము. |
| పారిశ్రామిక శిక్షణ కేంద్రము | : 7-వ రోజరీ చర్చిరోడ్డులో ఆంధ్ర మహిళాసభ పారిశ్రామిక భవనములో వస్త్రములపై అద్దకపుపని, మిషనుకుట్టు, మిషను అల్లిక, చేనేత, బుక్ బైండింగు, ఎంబ్రాయిడరీ మొదలగు పరిశ్రమలలో శిక్షణ ఇవ్వబడుచున్నది. |
| టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్ | : స్త్రీలకు టైపు.—గవర్నమెంటు పరీక్షలకు శిక్షణ. |
| మహిళా మందిరము | : స్త్రీ విద్యార్థినులకు వసతి గృహము. |
| ఆంధ్ర మహిళ | : స్త్రీలలో విద్యా వ్యాప్తికై స్త్రీలచే నడుపబడుచున్న సచిత్ర మాస పత్రిక |
| నర్సింగ్ హోమ్ | : స్త్రీ శిశు సంరక్షణశాల, ప్రసూతిశాల, ఉచిత వైద్యశాల, కుటుంబ నియంత్రణశాల, దంత వైద్యశాల— అడయారులో నిర్మించబడినది. భారత ప్రభుత్వ ఆరోగ్య శాఖవారి విధానాన్ని అనుసరించి, సంక్షిప్త నర్సు ఎయిడ్.—మంత్రసాని పనులలో శిక్షణ యివ్వబడుచున్నది. |
| ముద్రణాలయము | : ఆంధ్ర మహిళా సభ వారిచే స్వంతంగా స్థాపించబడినది. విద్యార్థినులకు అచ్చుకూర్పు, బైండింగ్, ప్రూఫు రీడింగు. మొదలైనవి ఉచితంగా నేర్పబడును. |
| నాగేశ్వర శిశువిహార్ | : పిల్లల విద్యా వినోద కేంద్రం. |
| వనితా బాలవిహార్ | : స్త్రీలకు, పిల్లలకు, సాయం. ఆటస్థలం. |

Edited, Printed & Published by Mrs. K. Lakshmi Raghuram, B.A., at the Andhra Mahila Press, Mylapore, Madras 4